# సమర్థ సద్గురు

## ఆధ్యాత్మిక మాసపత్రిక


శ్రీకాళీగార్డెన్స్ ఆశ్రమం - 522508, గుంటూరు జిల్లా

ఫోన్ : (0863) 2293280, 2293564, 2293206

web: www.mathaji-babuji.org samardhasadguru@rediffmail.com





Volume 29 Issue 2

No.of Pages 48

OCTOBER 2009

| | | |
|---|---|---|
| 5సం॥లచందా | రు. | 250.00 |
| 2సం॥ల చందా | రు. | 120.00 |
| సంవత్సర చందా | రు. | 60.00 |
| విడిప్రతి వెల ..... .. | రు. | 5.00 |

బ్యాంక్ డ్రాఫ్ట్స్ A/C.Y.S.C.K.P.M చారిటబుల్ ట్రస్ట్ పేరులో డ్రా చేయండి. M.O.,బ్యాంక్ డ్రాఫ్ట్స్ పంపవలసిన చిరునామా:

మేనేజరు

సమర్థసద్గురు మాగజైన్

శ్రీకాళీగార్డెన్స్-522508

Printed, Published by C.V. Ramana Babu, on behalf of YOGINI SRI CHANDRA KALI PRASADA MATHAJI CHARITABLE TRUST and Printed at Samardha Sadguru Publications, D.No. 3-499, Sri Kali Gardens Ashram, Nambur - 522508, Guntur Dist., Andhra Pradesh, and published at D.No. 3-499, Sri Kali Gardens Ashram, Nambur - 522508, Guntur Dist., Andhra Pradesh. Editor - Guda Siva Rama Murthy,


**ఈ సంచికలో....** **పేజీ**



**దీపావళి శుభాకాంక్షలతో**

# భద్రవాక్యం

**మహదహంకారవృథివ్యాపస్తేజోవాయురాకాశాత్మకత్వేన బృహద్రూపేణ అండకోశేన కర్మజ్ఞానార్థ రూప తయాభాసమానమ్ అద్వయమ్ అఖిలోపాధి వినిర్ముక్తమ్ తత్సకల శక్త్యుపబృంహితమ్ అనాద్యంతం శుద్ధం శివం శాంతంనిర్గుణం ఇత్యాది వాచ్యం అనిర్వాచ్యం చైతన్యం బ్రహ్మ।**

-నిరాలంబోపనిషత్

సృష్టికన్నముందునుంచి సచ్చిదానందమైన బ్రహ్మము ఒక్కటే ఉన్నది. సృష్టి చేయాలి అన్న సంకల్పం కలిగినప్పుడు అందులో ఒక అవ్యక్తమైన మార్పు వచ్చింది. అదే అవ్యక్తం. అవ్యక్తం నుండి మహత్, మహత్ నుండి అహంకారం, అహంకారం నుండి పంచభూతాలు, పంచజ్ఞానేంద్రియ కర్మేంద్రియాలు, బుద్ధి, ప్రాణము, వాటినుండి బృహత్, దాని నుండి బ్రహ్మాండము, చేతనా చేతనములతో కూడిన పంచభూతాత్మక సృష్టి వ్యక్తమైంది. ఇవన్నీ ఒక స్త్రీ గర్భము ధరించి బిడ్డను కన్నట్లుకాక, అక్కడ బ్రహ్మమే ఉన్నా వివర్తం వలన అదే అవ్యక్తంగా, మహత్తుగా, బ్రహ్మాండంగా సృష్టిగా కనిపిస్తున్నది. కారణం కంటె కార్యం ఎప్పుడూ వేరుకాదు. ఈ న్యాయముననుసరించి అవ్యక్తము మొదలైనవి వాటి కారణమైన బ్రహ్మముకన్న వేరు కాదు. ఒక సూక్ష్మమైన మఱ్ఱివిత్తనంలో కనపడకుండా ఏకరూపంలో ఒక మఱ్ఱి చెట్టు బృహద్రూపం దాగి ఉన్నట్లు, తిలలో తైలం దాగిఉన్నట్లు, బ్రహ్మము సర్వే సర్వత్రా వ్యాపించి ఉన్నది. అది చర్మ చక్షువులకు కనపడదు. కాని సాధన ఫలించినప్పుడు సాధకులకు వారి స్వరూపంగా అపరోక్షానుభూతిగా సాక్షాత్కరిస్తుంది.

బ్రహ్మముకన్న ఇతరమైనది లేదు కనుక అది అద్వయం. అన్ని ఉపాధులు దానినుండే వచ్చినా, అది ఏ ఉపాధీ కాదు. దానికి ఏ ఉపాధీ లేదు కనుక అది అఖిలోపాధి వినిర్ముక్తం. సృష్టివ్యక్తం కావటానికి అవసరమైన మూలశక్తి తనలోనే తన కన్న అభిన్నంగా ఉంటుంది కనుక తత్సకల శక్త్యుపబృంహితం. బ్రహ్మమునకు ఆరంభము, అంతము లేదు గనుక అనాద్యంతం. మలినరహితము, ఉపాధుల మలినాలు తనకు అంటనిది కనుక అది శుద్ధం. శ్రేయస్సును కలిగించేది, మంగళ కరమైనది కనుక శివం. కామక్రోధాదులు, రాగద్వేషాదులూ సుఖదుఃఖాదులు ఏవీ లేక సర్వసృష్టి తనలో ఉపశమించి, అలలన్నీ తనలోనే ఉపశమించి శాంతించిన నిస్తరంగ కాసారంలాగా ఉంటుంది కనుక శాంతం. త్రిగుణ రహితమైనది కనుక నిర్గుణం.

శబ్దాలలో, ఉపమానాలతో, విధి, నిషేధ, అవాంతర, మహావాక్యాలతో ఎంత చెప్పినా, అది ఇంకా అనిర్వచనీయమే. పంచదార రుచి ఎలా ఉంటుందో తెలియ జేయలేని శబ్ద జాలం బ్రహ్మమును ఎలా వర్ణించగలదు. బ్రహ్మము కేవలం అనుభవైక వేద్యం. అందుకే అది ఇత్యాది వాచ్యం, అనిర్వాచ్యం చైతన్యం అని నిరాలంబోపనిషత్తు బ్రహ్మమును నిర్వచిస్తున్నది. *

# అమ్మ ఆశీస్సులు

**శరణాగత దీనార్త పరిత్రాణ పరాయణే ।**
**సర్వస్యార్తి హరే దేవి నారాయణి నమోస్తుతే ॥**

శ్రీ దుర్గా సప్తశతి పారాయణలో జగన్మాతను మనందరము ప్రార్థించు కున్నాము. శరణు పొందిన దీనులను పరిరక్షించుటయే పరాయణముగా గలిగిన శ్రీ అమ్మ, ఆర్తత్రాణ పరాయణి, అందరి ఆర్తిని ఆవేదనను హరించే దేవి, నారాయణికి నమస్కరిస్తున్నాను. లోకంలో ప్రతీది దేనినో ఒక దానిని ఆశ్రయించే ఉన్నది. అంతవరకు ఎందుకు? ఈ జీవితములో దేహము ఏ జగన్మాత ఆధారము చేత అన్నిటినీ చేయగలుగుతోంది? ఆనందించ గలుగుతోంది? పొంద గలుగు తోంది? అలాగే అన్నీ. శ్రీ జగన్మాత,**"సృష్టి, స్థితి, లయ కారిణి మా"** అన్నట్లు అన్నీ తనలోనుండే సృష్టిస్తూ, తనలోనే వృద్ధి పొందిస్తూ, తనలోనే లయము చేస్తున్న సర్వ కారణ కారణము తానేయై అంతట నిండిఉన్న అనంత స్వరూపిణి అమ్మను-

వందనమోమాతా కాళికా ప్రియజనని, దేవీ దీనాజనా పరిపాలా
కరుణామయివని శరణము కోరితినే, ప్రఫుల్లవదనా,
ప్రశాంతి సదనా, ప్రసన్నవగుమా ॥వందన॥
నీ కనుసన్నలలో ఈ లోకము మొదలగునే
కనుదమ్ముల కాంతులలో కళ కళ లాడుచు మనునే
నీ కనుబొమ ముడిలో నిఖిలము లయమగునే,
పరమ పావనీ,నతజనావనీ, ప్రళయకారిణీ, భవభయహారిణి ॥వందన॥

అని ప్రార్థించుకుంటూ శ్రీదేవీ శరన్నవరాత్ర మహోత్సవములను శ్రీ సద్గురుదేవులు అందరిలో ఉండి ఎందరెందరో భక్తుల ద్వారా దివ్యంగా జరిపించుకున్నారు. అందరిలో ఉన్న శ్రీ సద్గురుదేవులకు కృతజ్ఞతాభివందనములు తెలియజేస్తూ, ఇక ఈ నెలలో మరలా ఈశ్వరా అన్నట్లు కార్తీక మాసం వస్తుంది. శివ స్వరూపంలో ఆరాధనలు, అభిషేకములు జరుగుతాయి. భక్తి గొప్పదా? పూజ గొప్పదా? అంటే భక్తి లేని పూజ పత్రి చేటు అన్నారు పెద్దలు. భక్తితో పూజిస్తేనే అది పూజ. పూర్ణమైన అనంతమునుండి జనించి స్వరూపముతో మనని అనుగ్రహించునదైనది. నవంబరు 2 వ తారీకు కార్తీక గురు పూర్ణిమ -శ్రీ గురుపూర్ణిమ. 5వ తేదీనుండి ప్రారంభించబడి 11 వ తేదీ రాత్రి మరియు 12 వతేదీ ఉదయం 6గం.30 నిల వరకు శ్రీ సద్గురుదేవుల పుణ్యారాధన మహోత్సవములు జరుగును. అన్నీ శ్రీ సద్గురు దేవుల అనుగ్రహమే కదా!

అట్టి శ్రీగురు పరమాత్మ సేవకు అందరూ వచ్చి అన్ని కార్యక్రమములలో పాల్గొని, తీర్థ ప్రసాదములు స్వీకరించి తరించమని ప్రార్థిస్తూ-

నిరంతరము శ్రీ సద్గురు దేవుల ఆశీస్సులు మనందరిపై వర్షించుగాక!

- మీ అమ్మ

# సంపాదకీయం

శ్రీ సద్గురు దేవుల పరమానుగ్రహంతో, పూజ్య యోగిని శ్రీ చంద్ర కాళీ ప్రసాద మాతాజీ అనుగ్రహ పర్యవేక్షణలో శరదృతు మహోత్సవాలు, ద్వాదశాహ్నిక దీక్షాపూర్వకంగా ఎంతో భక్తి భరితంగా వైభవోపేతంగా జరిగాయి. అవటానికి శరన్నవరాత్రులైనా, శ్రీ కాళీవనాశ్రమంలో అవి తొమ్మిది రోజులలో ఎప్పుడూముగియలేదు. తెల్లవారుజాము 4గంటలనుండి ఊపిరి సలపని కార్యక్రమములతో భక్తుల మనస్సులు అన్య విషయముల గురించి ఆలోచించటానికి అవసరంకాని, అవకాశం కాని లేకుండా కార్యక్రమాలు ఏర్పాటు చేశారు. కార్యక్రమాలకు హైలైట్ సత్సంగ కార్యక్రమాలు అయితే, సత్సంగ కార్యక్రమాలకే హైలైట్ శ్రీ మాతాజీ బోధామృతం. దసరా పండుగ సందర్భంగా ఏర్పాటు చేసిన సత్సంగ కార్యక్రమాలను దృష్టిలో ఉంచుకొని, సెప్టెంబరు నెలలో త్రయాహ్నిక సత్సంగ కార్యక్రమాలు విడిగా జరుగలేదు.

ఈ నెల 16, 17 తేదీలలో నరక చతుర్థి, దీపావళి,29,30,31 తేదీలలో త్రయాహ్నిక సత్సంగ కార్యక్రమం జరుగుతుంది.

నవంబరు 2 వ తేదీ కార్తీక పూర్ణిమ. గురు పూర్ణిమ. శ్రీ సద్గురు పాదపూజ, సత్సంగ సమావేశము, శ్రీ ఉమారామలింగేశ్వరుల నగర పర్యటనోత్సవము, శ్రీ మాతాజీ వారి చాతుర్మాస్య దీక్షా విరమణ ఉంటాయి. 5 వ తేదీనుండి12 వ తేదీ వరకు సమర్థ సద్గురు దేవుల ఏకవింశతి వార్షిక పుణ్య ఆరాధన సప్తాహ మహోత్సవములు, శ్రీకాళీ వనాశ్రమంలో పూజ్య యోగిని శ్రీ చంద్రకాళీ ప్రసాద మాతాజీ వారి అనుగ్రహ పర్యవేక్షణలో సాప్తాహిక దీక్షతో, పంచ యజ్ఞ విధి పూర్వకంగా నిర్వహింపబడతాయి. 12వ తేదీ ఆశ్రమంలో విరమణ కార్యక్రమము అయిన తరువాత, అదే రోజు పెదనింద్రకొలనులోశ్రీ స్వామివారికి గురుపూజ మహోత్సవము, భక్త సమారాధన, తెప్పోత్సవం జరుగుతాయి.

ది. 21.11.09 నుండి ది. 27.11.09 వరకు గుంటూరు జిల్లా, సత్తెనపల్లి మండలం, కట్టమూరులో శ్రీ సద్గురు, గణపతి,సౌర,రుద్ర,శ్రీ చండీ యాగము పాంచరాత్ర విధానంగా జరుగుతుంది. భక్తులందరినీ అన్ని కార్యక్రమములలో పాల్గొని సద్గురు దేవుల కృపకు పాత్రులు కావలసినదిగా సాదరంగా ఆహ్వానిస్తున్నాము.

- గౌరవ సంపాదకుడు

# బాబూజీ ఉవాచ

(గత సంచిక తరువాయి) - స్వామి విజయేశ్వరానంద ప్రసాద్

అలాగే జీవునికి శాంతినిచ్చేవి యీషణ త్రయాలు, కామక్రోధాలు కావు. ఒక్క భగవానుని నామమే జీవునికి శాంతినివ్వగలదు. ఆ దివ్య చరణారవిందములే పరమశాంతిని ప్రసాదించగలవు. ఆ పాదద్వయమందు నిలిచిన మనస్సు తన మలినాన్ని పోగొట్టుకొని, శుద్ధ మనస్సు అవుతుంది. అట్టి శుద్ధ మనస్సు ఆత్మ దర్శనము పొంది శాంతిని అనుభవిస్తుంది. ఆనందంలో ఓలలాడుతుంది. ఆత్మానందమే ఆనందము. ఆత్మ సుఖమే సుఖము. మన పవిత్ర గ్రంథాలన్నీ యీ విషయాన్నే బోధిస్తున్నవి.



భగవానుని దర్శనము కమనీయమైనది. అది యింద్రియాలను మనస్సును పూర్ణలయం పొందింపజేస్తుంది. నారదుడు అందుకే ధర్మరాజుతో అన్నాడు "ఓ ధర్మరాజా! నీవు చాలా పుణ్యాత్ముడవయ్యా! చతుర్ముఖుడు, ఆయన నోటి నుంచి వచ్చిన వేదాలు కూడా ఆ భగవానుని తత్త్వాన్ని వర్ణించలేక పోయినవి. ఉపనిషత్తులు కూడా అది మాటలకు మనస్సుకు అందనిదని చెప్పి ఆగిపోయినవి. అటువంటి భగవానుడు మీ పాండవులందరికి చెలికాడై బావమరది అయి, అన్నిటిలోను మార్గదర్శకుడై, ఛలోక్తులతో మీ మనస్సులకు అహ్లాదం కలిగిస్తూ, ధర్మం తప్పకుండా నడిచే మీకు ఉత్తమ ఫలితాలను అందించాడు. మీ అదృష్టమే అదృష్టము" అని.

అటువంటి భగవానుని దివ్య దర్శనంలో మైమరచి భావ సమాధిలో ఓలలాడిన మహాభక్తులెందరో మన భారత దేశంలో ఉన్నారు. ఆ దర్శన మాత్రం చేతనే మానవుని హృదయంలో పేరుకు పోయిన అజ్ఞానమనే చీకటి పటాపంచలై వస్తు దర్శనము అవుతుంది. అవిద్యావరణ దోషం తొలగి స్వస్వరూప దర్శనం అవుతుంది. దాని ఆనందం మహాత్ములకే అనుభవము. భగవానుని దివ్య తేజస్సు యింద్రియాలకు అందేది కాదు. అందులో లయించి పోవలసిందే. అది ఏకో బ్రహ్మణ ఆనందః. నీటిలో సాంతం మునిగినవాడు ఇక శబ్దం చేయడు. శబ్ద రహితమై పోతుంది. కడవ నీళ్ళలో ముంచినపుడు శబ్దం అవుతుంది. పూర్తిగా నీళ్ళతో నిండినపుడు యిక శబ్దం రాదు. మళ్ళీ నీళ్ళు

పారబోస్తున్నపుడు శబ్దం అవుతుంది. అలాగే మానవుడు ఆ బ్రహ్మానందపు రుచిని సరిగా అందుకోనంత వరకు ఏదో శబ్దాలతో దానిని వర్ణించే ప్రయత్నం చేస్తాడు. కాని ఒకసారి ఆ ఆత్మానందామృతంతో మనస్సు పూర్తిగా నిండినపుడు ఇక శబ్దానికి తావులేదు. ఎందుకంటే అది శబ్దానికి అందేది కాదు. బెల్లం రుచినిగాని కారం రుచినిగాని ఎంత వర్ణించి చెప్పినా తెలియదు. కాని అది నోట్లో వేసుకుని దాని రుచిని అనుభవించాలి. అలా అనుభవిస్తున్న వాని ముఖాన్ని చూస్తే ఆ రుచి ఎటువంటిదో కొద్దిగా అర్థమవుతుంది. అలాగే రూపనామ క్రియా రహితుడైన పరమాత్ముని దర్శన ఆనందాన్ని అనుభవించ వలసిందేగాని మాటలతో వర్ణించలేము.

ఎన్ని స్నానాలు చేసినా, సబ్బులు అరగదీసినా, సెంట్లు పులుముకున్నా, దేహ వాసనలను, మలినాన్ని కొద్ది సేపు హరించగలవేమోగాని, మనస్సుకు పట్టిన మలినాన్ని హరించలేవు. జన్మ జన్మాంతర వాసనలు పేరుకు పోయిన మనస్సులోని కలుషాన్ని హరించేది, వాసనలను రహితం చేసేది ఆ భగవానుని దివ్య చరిత్ర ఒక్కటే. వాసుదేవుని చరిత్ర సర్వ వాసనలను హరిస్తుంది. అటువంటి దివ్య చరిత్రను వినాలంటే కాలాన్ని వ్యర్థం చేయకూడదు. మీరందరూ నమస్కారాలను త్వరగా ముగిస్తే, మీకు తత్త్వం బోధించే వ్యాపారం బాగా సాగుతుందని మీ హృదయ బాబు ఆశ. చెట్టుమీద ఉన్న పండుకోసం రాళ్ళు విసరగా విసరగా ఒక రాయి అయినా తగిలితే పండు పడుతుంది. అది తింటే ఆకలి తీరుతుంది. అలాగే భగవానుని చరిత్రలు వినగా వినగా, నామం చెయ్యగా చెయ్యగా ఏదో ఒకటి మనస్సుకు హత్తుకుని భగవద్దృష్టి కలుగుతుంది. అది కలిగితే ముక్తి ఫలం లభిస్తుంది. భవబంధ విముక్తి అవుతుంది గదా. స్విచ్చి వెయ్యగానే కరెంటు తగిలి బల్బు వెలుగుతుంది. చీకటి పోతుంది. అలాగే మనస్సు భగవానుని పాదాలకు touch అయిన వెంటనే అజ్ఞానం పోతుంది. కాంతిలో వస్తు దర్శనమై శాంతి కలుగుతుంది. ఆ touch వల్లనే కామక్రోధాదులు, యీషణత్రయాలు హరించిపోయి, నిర్వికార, నిరాకార, నిర్వికల్ప, నిరంజనమైన పరమాత్ముని కమనీయ ఆకృతి దర్శనమై, ఆత్మావలోకనము కలిగి, ఆత్మానందం లభిస్తుంది. యుగ యుగాలుగా అలా ఆత్మానుభూతిని పొంది తరించిన మహాత్ములెందరో ఉన్నారు.

-సశేషం

# మాతాజీ అభిభాషణ

(గతసంచిక తరువాయి) -జపమాల ప్రసాద

(23.03.2001 ప॥గో॥ జిల్లా అడవికొలను గ్రామంలో శ్రీ అవధూతేంద్ర సరస్వతి భజన మండలి వారి ఆధ్వర్యంలో "దోసయజ్ఞం" సందర్భంగా జరిగిన సత్సంగ సమావేశములలో శ్రీమాతాజీ వారి అభిభాషణ)

"ఈ దోసయజ్ఞానికి కారకులు పూజ్యపాదులు శ్రీశ్రీశ్రీ అవధూతేంద్రసరస్వతీ స్వామీజీ మహరాజ్‌వారు. పూర్వం వ్యవసాయదారులు పొలాల్లో విత్తనం నాటినప్పటినుంచీ మళ్ళీ విత్తనాలు తయారయేంతవరకూ హరేరామనామ సంకీర్తన విధిగా చేస్తూండేవారుట. అలా చేస్తే ఎకరానికి 30 బస్తాలు వచ్చేపంట 40 బస్తాలు పండేవిట. ఈ భగవన్నామం మనసులోని కలుషాన్ని హరించి, నిర్మలత్వాన్ని ప్రసాదిస్తుంది. "నామస్మరణాత్ అన్యోపాయం/నహిపశ్యామో భవతరణే॥" - అంటే ఈ భవసాగరం నుండి తరించడానికి, భగవన్నామ



స్మరణ కంటే అన్యమైన ఉపాయం వేరేదీ లేదు "నాస్తి నాస్తి కలౌ వాస్తి। హరినామ వినాగతి:" - ఈ కలికాలంలో హరినామం తప్ప వేరొక గతి లేదు లేదు లేదు - అంతే కాదు - "యత్ఫలం నాస్తి తపసా। నయోగేన సమాధినా। తత్ఫలం లభతే సమ్యక్ కలౌ కేశవ కీర్తనాత్।"

అంటే ఏ ఫలమయితే తపస్సు వల్లగాని, యోగం వల్లగాని, సమాధిస్థితి వల్లగాని లభించదో, అట్టి దివ్యఫలం ఈ కలికాలంలో కేవలం భగవన్నామ సంకీర్తన వలన ఎంతో చక్కగా లభిస్తుందని శ్రుతులు చెప్తున్నాయి. "హరేరామ హరేరామ రామరామ హరే హరే। హరే కృష్ణ హరేకృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే" అన్న షోడశాక్షరీ మంత్రం యీ కలికాలంలో మానవులు తరించడానికి చాలా సులభమైన మార్గం అని బ్రహ్మదేవుడు నారద మహర్షికి చెప్పినట్లు "కలిసంతరణోపనిషత్తు" లో చెప్పబడింది.

అత్యున్నతి స్థితిని మనకి ఎంతో సులభంగా ప్రసాదించే భగవన్నామాన్ని, ప్రాపంచిక వ్యామోహాలలో పడిపోయి విస్మరిస్తున్నారు మానవులు. తద్వారా

అనేక చింతలకి గురవుతున్నారు. ప్రొద్దుట లేచినది మొదలు కూరగాయల చింత, కూటిపై చింత, కొమ్మలపై చింత, ధనార్జన చింత - అన్నీ చింతలే ఒక్క రామనామ చింతన తప్ప. ఏ భగవచ్చింతన చేస్తే అన్ని చింతలూ చింతకాయలలా రాలిపోతాయో ఆ చింతన మట్టుకు చేయటం లేదు మానవుడు. భగవంతుడిని ఆశ్రయిస్తే అన్నీ వాడే చూసుకుంటాడని తెలుసు. అయినా మనసు నిలవదు. మహాత్ములని ఆశ్రయించి, వారి వెనుక తిరుగబట్టి, ఈనాటికి ఈమాత్రమేనా అబ్బింది మనకి. అందుకు ధన్యులం. భగవన్నామంలోని మాధుర్యం గ్రోలడం, నామసంకీర్తన చేయడం ఆ మహానుభావులు పెట్టిన భిక్షే.

శెనగగింజని ఆవకాయలో ఊరవేస్తే, దానికి ఆ రుచే అబ్బుతుంది. పంచదార పానకంలో ఉంచితే మధుర రూపాన్నే దాలుస్తుంది. అదేవిధంగా మన మనస్సుని భగవన్నామమనే మధుర రసంలో నిరంతరం ఊరవేసి ఉంచితే, అది భగవద్రూపాన్నే పొందుతుంది. ప్రపంచ రుచులలో ఊరవేస్తే, ప్రపంచరూపాన్నే పొంది, కామక్రోధాది గుణాలకి నిలయమై, సుఖదు:ఖ వలయంలో పడికొట్టుకుంటూ, అశాంతి పాలయిపోతుంది. నామసంకీర్తనలో ఓలలాడే వారి ముఖాలు చూడండి ఎంత ఆనందంతో వెల్లి విరుస్తూ ఉంటాయో! వారి హృదయాలు నిర్మలంగా ఉంటాయి. అటువంటి హృదయాలనుండి వెలువడే భావాలు కూడా ఎంతో ఆహ్లాదకరంగా ఉంటాయి. అవి ఇతరులకి ఎప్పుడూ మేలు చేసేవిగానే ఉంటాయి గాని, ఏ ఒక్క ప్రాణికీ హాని కలిగించవు. వారి హృదయం శాంతికి నిలయంగా మారిపోతుంది.

ప్రపంచ రుచులను మరిగిన మనస్సు తిరిగి వాటినే కోరుతుంది. అవి అనుభవించి అనుభవించి, అశాంతి పెరిగిపోయిన నాడు, ఏదో ఒకనాటికి, శాంతి కావాలి అనుకున్న ప్రతివారూ భగవన్నామాన్ని ఆశ్రయించి తీరవలసిందే. మాకు పాటలు రావండీ, మాకు రాగాలు, తాళాలు రావండీ అని ఎవ్వరూ భయ పడనక్కరలేదు. ముందు సరిగా రాకపోవచ్చు కానీ, అనగా అనగా అదే వస్తుంది.

"అనగననగ రాగ। మతిశయిల్లుచునుండు।
తినగ తినగ వేము। తియ్యనుండు।
సాధనమున పనులు। సమకూరు ధరలోన।
విశ్వదాభిరామ। వినురవేమ।'' ( వేమన పద్యం)

*

# సన్నిధిలో సంభాషణ

(గతసంచిక తరువాయి) - పరాశర ప్రసాద్

1-3-1985

ఈ రోజు రాత్రి శ్రీబాబు వాకింగ్ చేసిన అనంతరం భక్తులకు దర్శనం ఇచ్చారు. కొంతసేపు సంకీర్తన చేసిన తరువాత శ్రీబాబు మాట్లాడుతూ మనం చేసే ప్రార్థనగాని, సంకీర్తనగాని ఎలా ఉండాలి? అని ప్రశ్నించారు. “మనం ప్రార్థన చేసేటప్పుడు గట్టిగా నోరు విప్పి పిలవనవసరం లేదు. భగవంతుడు చెవిటివాడు కాదు. మన ప్రార్థన ఆర్తిగా ఉండాలి. పాట గొంతు చించుకుని పాడనవసరం లేదు. గట్టిగా పాడితే భగవంతుడికి వినబడదు. ఆ శబ్దం ఆకాశంలో కలిసిపోతుంది. అదేపాట ఆర్తిగా పాడితే లోకంబులు, లోకేశులు,లోకస్థులు, దాటి పెంజీకటకి ఆవలనున్న పరమాత్ముని చేరుతుంది. మనం నామాన్ని గానం చేసేటప్పుడు నామ స్వరూపుని రూపాన్ని చిత్రించుకొని ఆయన చరణారవిందములకు శిరస్సును చేర్చి ఆర్తితో ప్రార్థించాలి. అప్పుడే మనస్సు ఆయనలో లయమవుతుంది.

చైతన్య ప్రభువు ఆ విధంగా నామస్మరణ చేస్తూ తన్మయత్వంతో తన్నుతాను మరచేవాడు. శ్రీకృష్ణపరమాత్ముడు ఆయన్ను కాపాడుకోలేక అవస్థపడేవాడు.

ఇంతలో రెడ్డిగారు శ్రీబాబుకి నమస్కారం చేసుకుంటుండగా ఎలా ఉంది నీ ఆరోగ్యం? అని ప్రశ్నించారు. నీ తలలో అనేక చపలచిత్తమైన ఆలోచనలు వచ్చాయి. అవి పోవటానికే నిన్ను శిరస్సుపైన గంధం రాసుకోమని చెప్పాను. మరి ఇప్పుడు నీకు శాంతిగా ఉంది కదా! వక్ర ఆలోచనలు రావటం లేదుకదా! అదే గురు ఆజ్ఞాపాలన అంటే. గురుదేవుడు చెప్పిన బోధను విన్నంత మాత్రాన సరిపోదు. దానిని ఆచరించాలి.

భగవద్గీత భక్తియోగంలో అర్జునుడు సగుణ, నిర్గుణోపాసకులలో ఎవరు శ్రేష్ఠులు? అని కృష్ణపరమాత్మణ్ణి ప్రశ్నించాడు. ఆ విషయాన్ని తెలుసుకున్నంత మాత్రం చేత ఉపయోగం ఏమిటి? భగవానుడి నిర్గుణ తత్త్వం ఏమిటి? ఆయన సర్వవ్యాపకుడు. అంటే చీమలోను, ఈగలోను, దోమలోను, చెట్టులోను, మానవుడిలోను, బ్రహ్మలోను అంతటా ఉన్నది ఒక్కటే వస్తువు అన్న విషయాన్ని భావనలో కాకుండా క్రియలో చూపించాలి. అంతటా ఒకే వస్తువును దర్శించినప్పుడు ఇక శత్రువు అనేవాడు ఎవరు ఉంటారు? అప్పుడు

ఈర్ష్య, అసూయ , ద్వేషాలు ఎవరి మీద కలుగుతాయి? కామ క్రోధాది గుణాలు ఎక్కడ ఉంటాయి? అటువంటి స్థితిని మీరు పొంద గలిగితే భగవద్గీత భక్తియోగంలోని ఆ శ్లోక అర్థాన్ని మీరు గ్రహించి అనుభవ పూర్వకంగా తెలిసి కొన్నవారవుతారు.

స్వామికి వంగి వంగి నమస్కారం చేసినంత మాత్రాన అది భక్తి అనిపించుకోదు. నీ మనస్సు స్వామిమీద లగ్నం అయినప్పుడు స్వామి ఆజ్ఞ మీరగలవా? మనం చేసే సాధన చాలా గుప్తంగా ఉంచాలి. దానిని అందరికి చెప్పనవసరం లేదు. గురుఆజ్ఞాపాలన చేయటమే మీరు సాధన సరిగా చేస్తున్నట్లు నిదర్శనము. మానవుడు మనస్సు కలిగి స్వతంత్రంగా ఆలోచన చేయటం వలన గురుఆజ్ఞాపాలన చేయలేకపోవచ్చు. కాని ఈ వృక్షరాజము చూడండి నా ఆజ్ఞ ఎలా పాలన చేస్తుందో? ఈ చెట్టు ఎప్పుడూ విరగకాస్తుంది. కావాలంటే మీరే చూస్తారుగా!'' అని అన్నారు.

మీకు ఒక సంఘటన చెబుతాను. ఇదివరకు అనేక పర్యాయాలు చెప్పాను. ఒక ప్రచండ మహాపండితుడు భాగవత గ్రంథాన్ని ఆమూలాగ్రంగా చదివాడు. తన పాండిత్యాన్ని రాజుగారికి తెలియజేస్తే మహారాజుగారి అనుగ్రహాన్ని పొంది ధనాన్ని సంపాదించవచ్చని, రాజుగారి దర్శనార్థం వెళ్ళాడు. మహారాజుగారు పండితుణ్ణి ఉద్దేశించి మాట్లాడుతూ మీరు భాగవతాన్ని మరొక్కసారి చదివి రండి అప్పుడు మీ పాండిత్యాన్ని ప్రదర్శించటానికి అవకాశం ఇస్తాను అంటాడు.

ఆ పండితుడు మహారాజుగారు ఆ విధంగా ఎందుకు అన్నదీ తెలిసికోలేక ఇంటికి వెళ్ళి కొద్దిరోజుల తరువాత మళ్ళీ రాజుగారి దర్శనార్థం వస్తాడు. కాని మహారాజుగారు మాత్రం అదే సమాధానం చెప్పి పంపించి వేస్తాడు. ఆ విధంగా మహారాజుగారు మూడు పర్యాయాలు చేసేసరికి పండితుడు రాజుగారు చెప్పినదాంట్లో ఏదో ఆలోచించాల్సిన విషయం ఉందని తెలుసుకొని వెంటనే భాగవత గ్రంథాన్ని చదవటం మొదలు పెట్టాడు. ఆ పండితుని జన్మ సంస్కారం అప్పుడు బహిర్గతమైంది. కనువిప్పు కలిగింది. భాగవతంలోని రహస్యాన్ని తెలుసుకోగలిగాడు. తన జన్మ సార్థకం చేసుకోగలిగాడు. ఇక ఎన్నడూ రాజుగారి దర్శనార్థం వెళ్ళలేదు. తాను తరించటమే కాక అనేకమంది భక్తకోటికి భాగవత గ్రంథంలోని తత్వరహస్యాన్ని తెలియజేశాడు.

-సశేషం

## శ్రీకాళీగార్డెన్స్‌లో విశేషపూజా కార్యక్రమములు

**అక్టోబరు 2009**

4 ఆది పూర్ణిమ, శ్రీమాతాజీవారి 55వ జన్మదినోత్సవము,శ్రీ సద్గురు పాదపూజ,సత్సంగం, భక్త సమారాధన.

13 మంగ శ్రీ గురుదశమి, సత్సంగం, శ్రీ సద్గురు పాదపూజ.

16 శుక్ర మాసశివరాత్రి. నరక చతుర్దశి, సత్సంగం, శ్రీ సద్గురు పాదపూజ.

17 శని దీపావళి, శ్రీ సద్గురు పాదపూజ, భక్త సమారాధన.

21 - 29 శ్రీ రామలింగేశ్వరస్వామి లక్ష బిల్వ పత్ర పూజ

**29,30,31 త్రయాహ్నిక సత్సంగ సమావేశములు**

30 శుక్ర క్షీరాబ్ది ద్వాదశి, శ్రీ సద్గురుపాద పూజ, భక్త సమారాధన

**నవంబరు 2009**

2 సోమ గురుపూర్ణిమ, శ్రీ సద్గురు పాద పూజ, సత్సంగం, భక్త సమారాధన,శ్రీ ఉమా రామలింగేశ్వరుల నగరోత్సవము, జ్వాలా తోరణం, శ్రీ మాతాజీ వారి చాతుర్మాస్య దీక్షా విరమణ.

**5 గురువారం నుండి 12 గురువారం వరకు శ్రీ గురుదేవుల ఏకవింశతి వార్షిక పుణ్యారాధన మహోత్సవాలు**

5 గురు ఉదయం పంచ యజ్ఞ సహిత పుణ్యారాధన మహోత్సవ సాప్తాహ్నిక దీక్షా స్వీకరణ, పంచ యజ్ఞ ప్రారంభం. ప్రతిరోజు ఉదయం 8 గం.లకు శ్రీ రామ తారక పరబ్రహ్మ ప్రసాద్, శ్రీ వెంకటరమణ ప్రసాద్ గార్లచే శ్రీ గురుగీతా ప్రవచనము.

5వ తేదీనుండి - 12వ తేదీ వరకు ప్రతిరోజు - ఉదయం 4 గం.లకు సుప్రభాతం, నగర సంకీర్తన, 5 గం.లకు ప్రాతఃకాల ప్రార్థన, మహామంగళహారతి. 6గం.లకు బ్రహ్మశ్రీ కొండూరు రామ సుబ్రహ్మణ్యం గారిచే వేద పఠనము, ఆలయ దర్శనములు, తీర్థ ప్రసాదములు. మధ్యాహ్నం శ్రీ సద్గురు సహస్ర నామార్చనము, మహామంత్ర పుష్పము, దర్బారు. అనంతరం శ్రీ మాతాజీవారు భక్తులకు తీర్థం ఇస్తారు. భక్త సమారాధన, సాయంత్రం 6 గం.లకు ప్రార్థన, మహా మంగళహారతి.

5 - 11 వరకు ఉదయం 9 గం.లకు సత్సంగ సమావేశము, శ్రీ మాతాజీవారి అనుగ్రహభాషణ,సద్గురుదేవుల దర్శనము,బోధ (వీడియో).శ్రీ బాబూజీ మహరాజ్ వాడిన వస్తువుల మ్యూయజియమ్ ప్రదర్శన (అర్ధగంట)

7 శని రాత్రి 7 గం.లకు సమర్థ సద్గురు మధుర లీలాష్టకం నాటకం

| | | |
|---|---|---|
| 8 | ఆది | సామూహిక సద్గురు పూజలు. |
| 9 | సోమ | రాత్రి 7 గం.లకు డోలోత్సవము (ఊంజలసేవ). |
| 10 | మంగళ | రాత్రి 7 గం.లకు శ్రీ సద్గురుదేవుల మహాపుణ్యారాధన |
| 11 | బుధ | రాత్రి 7గం.లకుశ్రీసద్గురుదేవుల నగరోత్సవము, అనంతరం నౌకావిహారము (తెప్పోత్సవము). |
| 12 | గురు | తె.జా. 3 గం.లకు శ్రీ సద్గురుదేవులకు రుద్ర, నమక చమక సహిత మహాభిషేకము. దీక్షావిరమణ, మహామంగళహారతి. |

**గమనిక:** పెద నింద్రకొలను ఆశ్రమశాఖలో శ్రీ సద్గురు పాదపూజ, భక్త సమారాధన, సత్సంగం, తెప్పోత్సవం.

| | | |
|---|---|---|
| 15 | ఆది | మాసశివరాత్రి |
| 22 | ఆది | శ్రీ సుబ్రహ్మణ్యషష్ఠీ, శ్రీ సుబ్రహ్మణ్యస్వామివారికి అభిషేకము, సహస్రనామార్చన. |
| 28 | శని | గీతాజయంతి (సామూహిక గీతా పారాయణము) |

పంజాబులోని అమృతసర్ నగరమునందు బ్రాహ్మణ సంతర్పణము జరుగు చుండెను. అచ్చటనున్న ఒక మహమ్మదీయునకు బ్రాహ్మణులతో సహపంక్తి భోజనము చేయవలెనని కోరిక కలిగెను.పంజాబులోని హిందూ, మహమ్మదీయుల దుస్తులు ఒకే విధముగా నుండును. గడ్డము మొదలగునవి హిందువులకును, మహమ్మదీయులకును కూడా ఉండును. కావున అతడు ఫాలమున విభూతిని, చేతిలో చెంబును ధరించి బ్రాహ్మణులతో కూర్చుని భోజనము చేసెను. భోజనానంతరము దక్షిణ ఇచ్చుటకు శాఖా భేదములు చెప్పవలసి వచ్చెను. అచ్చట వేర్వేరు శాఖల బ్రాహ్మణులకు వేరు వేరు విధములుగ దక్షిణలను ఇచ్చు ఆచారము ఉండెను. సారస్వతునకు 0-8-0, ఆది గౌడునకు 0-6-0, కాన్యకుబ్జునకు 0-4-0 దక్షిణను ఇచ్చుచుండిరి. ఈ మహమ్మదీయుడు దక్షిణ తీసికొనుటకు వెళ్ళగనే నీవు ఏ శాఖకు చెందినవాడవు అని అడిగిరి. అతడు తాను గౌడ బ్రాహ్మణుడను అని చెప్పెను. ఏ గౌడుడవు? అని ప్రశ్నించగా నాతడు సమాధానము చెప్పలేకపోయెను.''ఓ ఖుదా! ఏ గౌడుడను?'' అని అప్రయత్నముగా అతని నోటినుండి వెలువడెను. అంతట ఈ మహమ్మదీయుడు బ్రాహ్మణుల పంక్తిలో భోజనము చేసెనని తెలిసికొని అతనిని కొట్టి తరిమి వేసిరి. దెబ్బలు తిని అతడు ఇంటికి వచ్చెను. చుట్టు ప్రక్కల ఉన్నవారు హిందువుల భోజనమెట్లున్నది? అని అడుగ అతడు సమాధానము చెప్పెను. "భోజనము బాగుగానే ఉన్నది. కాని దక్షిణ మాత్రం చేదుగా నున్నది.ఇటులనే ఇక్కడ ధనార్థి యగువానికి యమలోకమున దక్షిణ దొరకును.

\- వార్తాలాపము

# సత్సంగ సౌరభం

-శివ ప్రసాద్

(14-6-2009 జూన్ నెల త్రయాహ్నిక సత్సంగ కార్యక్రమాలలో చివరిరోజు ఉ.10గం.20ని.లకు బృందావనంలో శ్రీరామతారక పరబ్రహ్మప్రసాద్‌గారి ప్రవచన సంక్షిప్త రూపం) -ఎడిటర్

వాస్తవానికి భారత దేశానికి అంతటికీ ఒక ప్రెసిడెంట్ ఢిల్లీలో ఉంటే, ప్రతి జిల్లాలో ఒక ప్రెసిడెంట్ ఉంటాడు. ఇంకా ప్రతి పంచాయితీలో ఒక ప్రెసిడెంట్ ఉన్నారు. ఎక్కడకక్కడే వెంకటలక్ష్మి అనేవారు శ్రీబాబు. అయితే దోషం ఎక్కడ వస్తుంది అంటే, అది 'ఇంతే', 'ఇంత వరకే' అనుకున్నప్పుడు.

రెండు శబ్దాలు ఉన్నై. గురువు, బ్రహ్మము. **బృహతీతి బ్రహ్మ.** అంటే బ్రహ్మ అన్నింటికన్న పెద్దది. గురువు అన్నా అదే అర్థం. ఎంత గొప్పది అంటే ఇక అంతకంటే గొప్పదిలేదు. అదే పూర్ణం.

**పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణ ముదచ్యతే।**
**పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావ శిష్యతే॥**

సర్వం పూర్ణమే. సర్వత్రా వ్యాపించి ఉండే ఒకే వస్తువును నీవు ఖండంగా తీసుకుంటున్నావుగాని, అది ఖండంగా లేదు. అందుకే అణువులో బ్రహ్మాండం ఉన్నది అన్నారు.

మనం సంకల్పం చెప్పేటప్పుడు అద్య బ్రహ్మణః అంటున్నాము. అంటే ఈ బ్రహ్మ అని. ఎందువలన అంటే బ్రహ్మము అనంతమైనది కనుక. ఈ బ్రహ్మలన్నిటికి ఆధారమైన దానిని పరబ్రహ్మ, అంటున్నాము. దాని సూక్ష్మం అంతా మనలో ఉన్నది. అయితే ఈ పంచాయితీ ప్రెసిడెంట్ ఎప్పుడు పరబ్రహ్మము అవుతుంది అంటే, అది వరల్డ్ ప్రెసిడెంట్ (World President) అయినప్పుడు.

అది వాస్తవానికి ఖండం కాకపోయినా, ఆ అనంతంగా ఉన్నదానిని (భూసత్తాయాం అంటే ఉన్నది అని) అక్కడ ఉన్నది, ఇక్కడ ఉన్నది అని విభాగం చేస్తున్నావు. ఈ ఖండత్వభావం నీకు కలిగినప్పుడు, నీకంటె భిన్నమైన వస్తువులు చాలా ఉంటాయి. ద్వైతం రాగానే భయంవస్తుంది.

ఒంటరిగా ఉంటే నాకు భయమండీ తోడు కావాలి అంటారు కొందరు. ఇంతకుముందు మాతాజీ అనుగ్రహ భాషణంలో తోలుకొనిరావటం

విన్నాము కదా. తోలుకొని రావటం అంటే తోడుకొనిరావటం అనే. పాలు తోడువేస్తే పెరుగు అవుతుంది. తోలుకొస్తారా అంటే తోడుకొని రమ్మంటున్నారు. ఎత్తుకొని రమ్మంటున్నారు అంటేకూడ అదే అర్థం, తీసికొనిరమ్మని. శబ్దాలు రకరకాలుగా ఉంటై, తోడు ఉంటాడు అంటే సహాయంగా ఉంటాడు అనిపిస్తుంది. కాని శాస్త్రం ఏం చెప్తున్నది అంటే, ద్వితీయం అంటే రెండవది ఉంటే భయం వస్తుంది అని. రెండవవాడు ఉంటే వాడిమీద అనుమానం కలుగుతుంది. వీటన్నింటి ధాతువు ద్విష్. ద్విష్ అంటే ద్వేషం వస్తుంది. అందువలన దుఃఖానికి కారణం ఏది అంటే, మనం అంతా ఒకటే అనుకుంటే బాధలేదు, కాని పైవాడు ఎవడన్నా ఉంటే జాగ్రత్తగా ఉండమంటారు.

అభేదదర్శనం జ్ఞానం. దర్శనం అంటే ఊరికే చూడటంకాదు. చూడటం అంటే అనుభవించటం అని. అభేదం అంటే భేదం లేకుండా. భేదం అంటే పగులగొట్టటం. అఖండంగా ఉన్నదానిని ఖండంగా చెయ్యటం. నిజంగా ఉండకపోయినా, భావనలో లేనిదానిని ఉన్నట్లుగా కల్పన చేయటం. ఆ కల్పనను మనం సంకల్పం అంటున్నాము. కల్పన చేస్తే అది సంకల్పం ఎలా అవుతుంది? సద్వస్తువు కోసం చేసే కల్పన మంచిది అవుతుంది. సత్‌ను మనం పొందటానికి, నిత్యమైన దానిని, సంపూర్ణమైనదానిని పొందటానికి మనం ఒక కల్పన లేదా భావన చేస్తున్నాము. బయట చెప్పే సంకల్పానికి, ఆశ్రమంలో చెప్పే సంకల్పానికి చాలా తేడా ఉన్నది. బయట సంకల్పం లౌకిక విషయాలకు సంబంధించి చెప్తారు. కాని ఆశ్రమంలో, దానిని కూడ కలిపి, కాఫీత్రాగే అలవాటు ఉన్నవాడికి ముందు కాఫీ ఇస్తాము, తరువాత భోజనం కూడ పెడ్తాము అన్నట్లు, Child care and Education Centre లో ముందు వాళ్ళకు ఇష్టమైన వాటితో మొదలుపెట్టి, మెల్లగా నాయనా నీకు ఇవి ఇష్టమైనవి అయినా, కష్టం కలిగించేవి అని క్రమంగా చెప్పినట్లు. మనకు ధర్మం తెలుసు కాని మనం దానిని చెయ్యటానికి ఇష్టపడటంలేదు. మనకు అధర్మం ఏదో తెలుసు, కాని దానిని మానటానికి ఇష్టపడటంలేదు. శ్రీబాబూజీ మహరాజ్, 'నీకు మంచి అనిపించినవి నీకు వీలైనంత చెయ్యి, నీకు చెడ్డవి అనిపించినవి నీకు చేతనైనంత విడిచిపెట్టు' అని చెప్పారు.

చరణ్‌దాస్ అనే భక్తుడు ఒకసారి శ్రీబాబుతో నాకు ధ్యానం కుదరటం లేదండీ అన్నాడు. 'నిన్ను ధ్యానం చెయ్యమని ఎవరు చెప్పారు? నీవు వ్యాపారం

చెయ్యి, వ్యవహారం చెయ్యి' అన్నారు శ్రీ బాబు. ఏం చేయాలనేది వారివారి స్థితిని బట్టి ఉంటుంది. మనకేది మంచిదో తెలియదు. మంచి అయితే బాగుపడతాము అని తెలుసు, కాని ఏది మంచో తెలియదు.

క్రమక్రమంగా మనం మంచి నుండి కూడ, సత్యానికి, ధర్మానికి, అక్కడినుండి కూడ నిత్యానికి ఎదగాలి. ధ్యానం చెయ్యమన్నారు కాని నిర్బంధం పెట్టలేదు. కోతి తరువాత కోతికంటె కొంచెం గొప్పవాళ్ళం మనం. ఆ చంచలత్వం ఇంకా పూర్తిగా పోలేదు. స్వామి వివేకానంద చెప్పినట్లు ఏకాగ్రత కావాలి. ప్రధానమైనది చిత్తం. దానికి ఏకాగ్రత కావాలి. చిత్తైకాగ్రత లేకపోతే కావలసిన వస్తువు లభించదు. చిత్తం ఏకాగ్రం కాకపోతే అది లయంకాదు. కర్మాచరణం వలనకాని చిత్తశుద్ధి కలగదు. యోగీశ్వరులకు కర్మ అక్లిష్ట కర్మ, ఇంతకు ముందు మనం మూడు విధములైన కర్మలను గురించి విన్నాము. అందులో నిష్కామ కర్మ ఏ ఫలితాన్ని ఆశించకుండా చేసే సత్కర్మ. పరమాత్మ కోసం చేసే కర్మలను ఆశ లేకుండా చేస్తే చిత్తం శుద్ధం అవుతుంది. అది ఆత్మానుభూతిని పొందటానికి పనికి వస్తుంది. అది నిద్రకాని నిద్రవంటిస్థితి. **యస్మిన్‌కాలే ద్వైతభావం నాస్తి నిద్రాపి నా గచ్ఛతి తస్మిన్ కాలే ఉపలభ్యమానం యత్సుఖమస్తి సబ్రహ్మానంద ఇతి బ్రహ్మానందానుభవం.**

ఆ బ్రహ్మానుభూతిని పొందాలంటే వీలైనంతవరకు సంకల్పాలను మానేసి నిస్సంకల్పంగా ఉండటం, అది నాది, ఇది నాది కాదు వంటి వాటిని వీలైనంత వదిలిపెట్టటం, గురులక్ష్యార్థాన్ని నిరంతరం మనసులో నిల్పి సాధన చేయటం వంటివి చేయాలి. అది అంత తేలికగా కుదిరేదికాదు. **సతు దీర్ఘ కాల నైరంతర్య సత్కారాzzసేవితో దృఢభూమిః** అని పతంజలి యోగ సూత్రాలలో ఉన్నది. ఎంతో కాలం, నిరంతరము, ఆదరంతో సేవిస్తే కాని ఆ స్థితి లభించదు.

ఆ ఉద్దేశ్యంతోనే ~~ఈ~~ సత్సంగాలను మనకు ఏర్పాటు చేస్తున్నారు. వీలైనంత నిశ్శబ్దాన్ని పాటించండి. లక్ష్యార్థంమీద వీలైనంత మనస్సు నిలపండి.

**కామ్ కర్తేరహో నామ్ జవ్‌తేరహో.** మోహం నశించి సత్సంగం వల్ల నిస్సంగత్వం వస్తుంది. నిస్సంగత్వంవల్ల నిర్మోహత్వం వస్తుంది. నిర్మోహత్వం వల్ల నిశ్చలతత్త్వం వస్తుంది. అదే జీవన్ముక్తి. సత్సంగం ప్రారంభం, అంటే మొదటిక్లాస్, జీవన్ముక్తి మనందరి యొక్క లక్ష్యం.

- సశేషం

# సంత్ నామదేవ్ చరితామృతం

(గత సంచిక తరువాయి) -మనోజ్ కుమార్

ముక్తాయి ఇంకా కఠినంగా "నీవు మహా భక్తుడివి అయితే కావచ్చు. కాని నిజమైన హరిని ఇంతవరకూ గుర్తించనేలేదు. గురువులేని నీకు ముక్తిలేదు. ఆత్మదృష్టిలేని నీవు ఏమీ వడ్డించని విస్తరిగానే మిగిలిపోయావు. దైవికంగా గోరాకుంభార్‌గారు ఇక్కడే ఉన్నారు. ఆయన తన కుండలను పరీక్షించే కఱ్ఱతో తలపైన ఒక్కసారి అలా తట్టి ఏఘటం పచ్చిదో, ఏది సరిగ్గా కాలిందో వెంటనే చెప్పగలరు. పరీక్షకు సిద్ధమేనా?లేకపోతే నిజం బయటపడుతుందని బెదరిపోతున్నావా?"

నామదేవుడికి ఇది చాలా అవమానంగా అనిపించింది. "మీ ఇంట్లో నెత్తిమీద దెబ్బలు కొట్టించే సుస్వాగతం ఉంటుందని ముందు ఊహించలేదు. మీ జ్ఞానం, మీ పరీక్షలూ ఎవరికి కావాలి? మీకుండలో జ్ఞానం ఉంటే నా కుండలో భక్తి అనే అమృతం ఉన్నది. మీఇల్లు మీకు బాగుంటే, మాఇల్లు మాకు బాగుంటుంది. మీరేదో మాయచేసి వాసుదేవ్‌ను పంపిస్తే ఎరక్క అళంది వచ్చాను. వచ్చినందుకు మంచి శాస్తే జరిగింది. విఠలా ఇతరులను అవమానించే ఈ సిద్ధులముందునించి నన్ను వెంటనే పంఢరి తీసుకెళ్ళు. ఇకనించి నీమాటే వింటాను. ఎవ్వరి మాట వినను" అంటుంటే గుళ్ళో మ్రోగుతున్న ఘంటారావానికి నామదేవుడికి మెలకువ వచ్చింది.

ఇదేమిటి ఇవ్వాళ ఇంత ఆలస్యంగా లేచాను! ఈపాటికి స్నానం చేసి కాకడారతికి గుళ్ళో ఉండవలసింది అని గొణుక్కున్నాడు. మెలకువ రాగానే అనుకున్నాడు, "ఎంత చిత్రమైన కల! ఆ అళంది సోదరులు పరబ్రహ్మము యొక్క పూర్ణస్వరూపం. ముక్తాబాయి చిత్కళ. పూర్ణజ్ఞానానికి ఆవల ఉన్న తేజస్సు. అటువంటిది కలలో ఆమెను ఎంత అవమానించాను? ఆమె చెప్పిన దాంట్లో కానిదేమున్నది? అవన్నీ నేను కావాలని కోరుకున్నవే కదా! రాజాయికూడ తన పతిలో పరమేశ్వర సాక్షాత్కారం పొందింది. కాని నేనే దద్దమ్మలా ద్వైతంలో మిగిలిపోయాను. ముక్తాబాయి చెప్పింది అక్షర సత్యం. సద్గురుప్రాప్తి అనే హఠం తీర్చేదాక ఏమైనా సరే ఇవాళ విఠలుడిని వదలను అనుకుని చంద్రభాగలో స్నానంచేసి శుచిర్భూతుడై గుళ్ళోకి వెళ్ళి శిలావితర్దికమీద నిలబడ్డాడు.

అలా ఎంతసేపు గడిచిందో. గర్భగుడిలో దైవవాణి వినిపించింది. "నామదేవా! ఈ ప్రపంచం ఒక స్వప్నం. నా సగుణరూపంకూడా అంతే. దానిని దాటితేగాని నీకు పూర్ణసత్యం లేదా అద్వైతసిద్ధి కలగదు. దానికి మార్గదర్శనం చేసేవాడే గురుదేవుడు. సత్యగురువుకు తాను గురువునన్నధ్యాసే ఉండదు.

పొగడ్తలు అంటే అసలు ఇష్టం ఉండదు. ఉదాసీనుడూ, నిర్మలుడూ, చిన్నపిల్లవాడివలె నిష్కల్మషమైన, నిష్కపటమైన వాడు. నిందాస్తుతులను సమంగా చూసేవాడు. ద్వంద్వాలు, ద్వైతం లేనివాడు. సజ్జనులతో కలవటం ఆయనకు ఆనందం కలిగిస్తుంది. ఆయునకు కోరిక అంటూ ఏదన్నా ఉంటే అది సత్సాంగత్యమే. సద్గురువు అంత తేలికగా లభిస్తాడనుకోకు. చంద్రుడి కోసం చకోరం తీవ్ర విరహంతో ఎదురు చూసినట్లు ఆయన కోసం తపించు. నీ ఆవేదన తీవ్రమైనదైతే గురుదేవులు తమంతతామే నిన్ను తమ పాద సన్నిధికి చేర్చుకుంటారు. నిన్ను నీవే నా మోహంలో ఇరికించుకుని ఇక్కడే పడి ఉండకు. పంఢరి వదలి తీర్థ యాత్రలు చేయి. ఏదో ఒక తీర్థంలో నీకు నీ గురుదేవులు తప్పక తారసపడతారు. నీకు నా ఆశీస్సులు ఎప్పుడూ ఉన్నాయి.

నామదేవుడి కళ్ళు శ్రావణమేఘాలలా వర్షిస్తున్నాయి. అంతవరకూ తనను కప్పిన ఒక మబ్బు తెర ఏదో తొలగినట్లయింది. విఠలుడి మూర్తి మందహాసం చిందిస్తూ తనను ఆశీర్వదిస్తుంటే ఆ సగుణ రూపాన్ని చూస్తూ బయటపడ్డ నామదేవుడు అంతర్ముఖుడైనాడు.

జనిని, రాజాయిని సమాధానపరచి నామదేవుడు బయటపడ్డాడు. చంద్రభాగ ఆశీర్వచనం, ఆమె తన సోదరి గోదావరికి అందించమని ఇచ్చిన సందేశం తీసుకొని ముందుకు ప్రయాణం సాగించాడు. దారిలో వాసుదేవ్ కలిశాడు. ఇద్దరూ కరమాళ చేరుకుని విష్ణు ఆలయంలో బస చేశారు. దామా శెట్టి కొడుకు నామా వచ్చాడని తెలిసి, ఊళ్ళోవాళ్ళంతా వచ్చి సంకీర్తన చేయవలసిందిగా కోరారు. పాండురంగడి ఆజ్ఞగా భావించి నామదేవుడు చిడతలు చేతబట్టి సంకీర్తన చేశాడు. సంకీర్తన అయ్యాక ఒక గృహస్థుడు నామదేవుడి పాదాలు పట్టుకొని

**గృహ -** మహరాజ్! మీరు నామీద దయతలచి మా ఇంటికి భోజనానికి రావలసిందిగా మనవి. కాదనకండి. మా ఆడది సజ్జనులంటే మండి పడుతుంది. దాని భయంతో ఏ సాధువూ మా ఇంటికి రాడు. మీవంటి మహాత్ములు వచ్చి దానికి నాలుగు మంచి మాటలు చెప్పి మంచి మార్గంలోకి మరలించి పుణ్యం కట్టుకోవలసిందే తప్ప మార్గం లేదు. మీరు సరే అంటేగాని మీ పాదాలు వదలను.

**వాసు -** అయితే ఇదేదో తప్పక వెళ్ళవలసిందే. మీరు వెళ్ళిరండి.

**నామ -** మీరు రారా?రాకూడదా?

**వాసు -** నాకు భిక్షాటన తప్ప ఎవ్వరింట్లో భుజించే ఆజ్ఞలేదు. మీరు వెళ్ళండి. మీరు వచ్చేలోగా నాలుగిళ్ళల్లో భిక్ష అడిగి తెస్తాను.

వాసుదేవ్ వేణువు ఊదుకుంటూ వెళ్ళిపోయాడు. నామదేవుడు గృహస్థుడితో పాటు అతని ఇంటికి వెళ్ళాడు. -సశేషం

# గురుకృప

(గతసంచిక తరువాయి) -శివ ప్రసాద్

**ఉదం -** రాజా! గురుకృప కలవానికి మృత్యువంటే భయమెక్కడిది? సరే నీ ఇష్టమే కానీ. అయితే నా ఈ ప్రార్థన ఒక్కటి మాత్రం మన్నించు. నేను ఇప్పుడు గురుకార్యార్థినై ఉన్నాను. అది పూర్తికాగానే వెంటనే తిరిగి నీ దగ్గరకు వస్తాను. అప్పుడు నన్ను నీవు అవశ్యం భక్షించు. నా నాలుక ఎన్నడూ అనృతం పలుకదు. రాజా! నీవు అర్థులకు అడిగినవి ఉదారంగా ఇస్తావని విన్నాను. నేను దానం గ్రహించటానికి పాత్రుడను. నేను కోరే కోర్కె నాకోసం కాదు. దానిని నీవు తప్పక తీరుస్తావు అనే కృతనిశ్చయంతో నీవద్దకు వచ్చానయ్యా!

**మి.స -** (కొంచెం మెత్తబడి) ఓ మునీంద్రా! నీవు నా వద్దకు ఏమి అర్థించటానికి వచ్చావు?

**ఉదం -** రాజా! నీ పత్ని మదయంతి ధరించే కుండలాలు, మా గురుపత్ని కావాలని కోరింది. నేను ఆ కుండలాలను అర్థించటానికి వచ్చాను. అవి గురుదక్షిణగా సమర్పించి గురుఋణం తీర్చుకుంటాను.

**మి.స -** (నవ్వుతూ) విప్రోత్తమా! ఇది చాలా బాగుంది. ఎవ్వరైనా తన వస్తువులను దానం చేస్తారుగాని ఇతరుల సొత్తును దానం చేస్తారా? ఇటువంటి చోద్యం ఎక్కడైనా కలదా? కుండలాల ప్రసక్తి వదిలేసి వేరే ఏదైనా అడుగు.

**ఉదం -** రాజా! నీ మాటలు చాలా చిత్రంగా ఉన్నాయి. నీవు సాకులు చెప్పి తప్పించుకునే వాడవు కావని నీ దాన శీలత వినే నేను నీ వద్దకు వచ్చాను. అదట్లా ఉండనీ, ఈ కుండలాలైనా గురుకార్యార్థం కావలసి వచ్చానుకాని నాకై అర్థించవలసిన అవసరం ఏమున్నది? నాకు అన్యపదార్థములతో పని ఏమున్నది? కుండలాలు తప్ప వేరే ఏదీ అవసరం లేదు. కుండలాలు ఇవ్వటం ఇష్టం లేకపోతే నన్ను భక్షించి నీ కోర్కె తీర్చుకో. గురు ఋణం తీర్చుకోలేని ఈ జన్మ వృథా.

**మి.స -** సరే. విప్రోత్తమా! అలా అయితే మహారాణి చెంతకు వెళ్ళి నేను పంపించానని చెప్పి నీ వాంఛితార్థం వెల్లడించు.

**ఉదం -** సౌదాస నరేంద్రా! ఆ దేవి ఇప్పుడెక్కడ ఉన్నది?

**మి.స -** (వేలితో సంజ్ఞ చేసి చూపుతూ) అదుగో అదే ఆమె నివసించే చోటు. నీవు ఆమె వద్దకు వెళ్ళి కుండలాలను అర్థించు.

ఉదంకుడు అలాగే అంటూ అక్కడికి వెళ్ళాడు. కాని అతనికి ఆ సౌధంలో మదయంతి ఎక్కడా కనిపించలేదు. అతడు తిరిగి మిత్రసహుడి

దగ్గరకు వచ్చి రాజా! అక్కడ ఆ దేవి కనిపించలేదు అని చెప్పాడు.

**మి.స -** ఓ సంయమీంద్రా! నాకు చాలా ఆశ్చర్యంగా ఉన్నది. మదయంతీదేవి మహా పతివ్రత. ఆమె అశుచిగా ఉండేవాళ్ళకు కనిపించదు. కాని అకళంక చరితుడవైన నీవు అశుచివి అని నేను ఎలా అనగలను? ఇందులో ఎక్కడో ఏదో రహస్యమున్నది.

ఉదంకుడు ఏం చేయాలో పాలుపోక గురుదేవులను మనస్సులో స్మరించుకున్నాడు. అతని మనస్సులో వెంటనే ఒక ఆలోచన వచ్చింది. 'అవును, నేను ఆ వృషభం విసర్జించిన గోమయాన్ని నా ముఖానికి పాదాలకు పూసుకున్నాను అన్న అశుచి భావన నా మనస్సులో ఉండబట్టే ఆ పరమ పతివ్రత దర్శనం నాకు కాలేదు' అనిపించింది. వెంటనే అతడు ప్రాఙ్ముఖుడై ఆచమనం చేసి శుచిర్భూతుడై మదయంతీదేవి నివాసానికి మళ్ళీ వెళ్ళాడు.

**మద -** భూసురేంద్రా! నమస్కారం. దయచేసి తమ రాకకు కారణం తెలియచేయండి.

**ఉదం -** తల్లీ! నన్ను సౌదాస నరేంద్రుడు పంపించాడు. గురుకార్యార్థమై నీవు ధరించే కుండలాలను అర్థించి మా గురుపత్నికి గురుదక్షిణగా సమర్పించటానికై వచ్చాను.

**మద -** మహాత్మా! అలా అయితే మీరు నా స్వామి వద్దనుండి నాకు ఏదైనా ఆనవాలు తెచ్చి ఇవ్వండి.

ఉదంకుడు మిత్రసహుడివద్దకు తిరిగి వచ్చి

**ఉదం -** మహారాజా! మదయంతీ దేవి నీవద్దనుండి ఏదైనా ఆనవాలు తెచ్చి ఇమ్మన్నది. దయచేసి నాకు అభిజ్ఞానం ఇస్తే నేను వెళ్ళి ఆయమ దగ్గర కుండలాలు పరిగ్రహిస్తాను.

**మి.స -** ఓ సంయమీంద్రా! నా మాటలుగా ఆ దేవికి ఇలా చెప్పు. "ఈ మార్గము క్షేమమైనది, భద్రమైనది అని గట్టిగా నిశ్చయంగా చెప్పటానికి వీలులేదు. కాని ఇంతకన్నా వేరొక మార్గం కూడా ఏదీ లేదు."

ఉదంకుడు మదయంతి దగ్గరకు తిరిగి వెళ్ళాడు.

**మద -**భూసురశ్రేష్ఠా! నా భర్త వద్దనుండి ఆనవాలు తెచ్చారా?

**ఉదం -** అమ్మా! సౌదాస నరేంద్రుడు తన మాటలుగా ఇలా చెప్పమన్నాడు."ఈ మార్గము క్షేమమైనది, భద్రమైనది అని గట్టిగా నిశ్చయంగా చెప్పటానికి వీలులేదు. కాని ఇంతకన్నా వేరొక మార్గం కూడా ఏదీ లేదు." ఇదే ఆనవాలు అని కూడా చెప్పమన్నాడు.

**మద -** ఓ భూదేవా గురుహితార్థివైన నీకు నా భర్త ఆజ్ఞమేరకు కుండలములను సమర్పిస్తున్నాను. మహాత్మా! ఈ కుండలములు మహా మహిమాన్వితములైనవి. భక్తితో వీటిని పూజించి ధరించినవారికి ఆకలిదప్పులు కాని, అగ్ని భయముకాని, విషబాధలు కాని, సర్ప, భూత, భేతాళ బాధలు కాని ఏవీ కలుగవు. ఇవి చిన్నవారుకాని, పెద్దవారు కాని ఎవరు ధరిస్తే వారి చెవులకు సరిగ్గా సరిపోయి అమరి ఉంటాయి. అంతే కాదు బంగారాన్ని కురిపిస్తాయి. వీటి మహిమ తెలిసినవారు గనుక సురలు, గంధర్వులు, నాగులు ఈ కుండలాలను ఎలా దొంగిలించాలా అని అనేక ఉపాయాలు పన్నుతూ నిరంతరం అవకాశం కోసం కాచుకొని చూస్తూ ఉంటారు. ఎంగిలి తగిలినా, నీవు ఏమరుపాటుతో నిదురించినా, వీటిని నేలపై పెట్టినా వారిలో ఎవరికి అవకాశం దొరికితే వారు వెంటనే వీటిని తస్కరిస్తారు. నాయనా! అప్రమత్తుడవై వీటిని నీ గురుదేవుల వద్దకు చేర్చి వారి అమోఘమైన ఆశీస్సులను పొందు.

పరమ పతివ్రతా శిరోమణి అయిన ఆ మదయంతి ఉదంకుడికి అన్ని జాగ్రత్తలూ చెప్పి భక్తి, ప్రేమ, వినయము మనస్సులో వెల్లువలా పొంగిపోతుంటే ఉదంకుడికి ఆ కుండలములను ఇచ్చింది. ఉదంకుడు పరమానందభరితుడై ఆ దేవిని ఆశీర్వదించి, సౌదాస నరేంద్రుని వద్దకు వచ్చి చిరునవ్వు ముఖములో తాండవిస్తుండగా తాను కుండలములు పొందిన సంగతి చెప్పి.......

**ఉదం -**రాజేంద్రా! నీవలన నేను కృతార్థుడనైనాను. గురుకార్యము నెరవేరింది. కాని నీవు ఆనవాలుగా చెప్పిన వాక్యము అత్యంత గూఢార్థము కలిగినదై దాని భావమేమో తెలియరాకున్నది. నీవా పతివ్రతా శిరోమణికి ఆ సంజ్ఞ ద్వారా ఏమి తెలియచేశావో తెలుసుకోవాలని ఉన్నది. అది నాకు చెప్పదగిన దైనచో దయచేసి వివరించవలసిందిగా ప్రార్థన. -సశేషం

**బాష్పాంజలి**

ఆశ్రమవాసి, న్యాయవాది శ్రీ శిష్ట్లా శశిధర్ ది. 13.09.09నాడు శ్రీ గురు సాయుజ్యం పొందారు. వీరి వయస్సు 48 సంవత్సరములు. వీరు అంతవరకు బ్రహ్మచర్యాశ్రమములో ఉండిరి. వీరి తల్లిగారు కలరు. శ్రీసద్గురుదేవులు వారికి చిత్త శాంతిని మనోస్థైర్యమును ప్రసాదించెదరు గాక!

# శ్రీకృష్ణ కర్ణామృతం

- సుశీలా ప్రసాద

**శ్లో॥ ముకుళాయమాన నయనామ్బుజం విభో**
**ర్మురళి నినాద మకరన్ద నిర్భరమ్**
**ముకురాయమాణ మృదు గణ్డమణ్డలమ్**
**ముఖ పఙ్కజం మనసి మే విజృమ్భతామ్ ॥**

"తపతీ! బుజమ్మీదున్న బిందెలో నీళ్ళు తొణికి కట్టుకున్న కోక, రైక తడిసిపోతున్నా చూసుకోకుండా ఏవిటా పరుగులూ, ఉరకలూ."

మాలతి మాటలు వింటూ వెనక్కి తిరిగిన తపతి "పరుగులు కాక మరేవిటి? అదిగో అటు చూడు!" తపతి వేలు చూపిన వేపు సూటిగా చూసింది మాలతి. తూర్పున ఉదయిస్తున్న పూర్ణ చంద్రుడు ఆకాశంలో పైపైకి ఎదిగి వస్తున్నాడు. పెరుగు చిలికిన చల్లలా ఉన్న ఆకాశంలో వెన్న ముద్దలా ఉన్నాడు "చూశాను సరే ! ఏవైందిట?" సావధానంగా మాట్లాడుతోంది మాలతి. తపతి సమాధానంగా "యమునా నదిలో కలువ మొగ్గలు ఇప్పుడిప్పుడే అరవిరుస్తున్నాయా ! ముడుచుకు పోతున్న తామర పూలలో తేనెలు తాగుతూ వేళమించినా గమనించని తన్మయత్వంలో తుమ్మెదలు ఆ పద్మాలలో బందీలు అయిపోతున్నాయా?" అంటుంటే "బందీలైపోయాం. కాదు కాదు, బందీలైపోతున్నాయి. ఇంకేమిటి?" ఉడికిస్తూ మాలతి రెట్టిస్తుంటే తపతికి ఓపిక సన్నగిల్లుతోంది. "అవి తనివితీరా తేనెలు తాగుతుంటే అదంతా తల్చుకుంటూ, నీ మనస్సు ఉరకలేయటం లేదా?" తపతిమాటలు వింటూమాలతి పకపక నవ్వుతూ "నువ్వన్నదంతా నాకర్థమైందిలే. పద పద, ఇప్పుడు నువ్వింటికి వెళ్ళి గోవులకి పాలుతీసి, కాగబెట్టి, వంటింటి పనులన్నీ చక్క బెట్టుకుని అత్తమామల నాదరించి, పెనిమిటిని అలరించి బిడ్డలను బుజ్జగించి, అదిగో ఆకాశంలో ఆ చందమామ నడి నెత్తిమీదికి వచ్చే సరికి ఆపైన.. ఇంకేం చెప్పను? మాలతి ఊపిరాడకుండా చెప్తుంటే తపతి గుండెలు గుబగుబలాడుతూ "అబ్బ! నన్ను మరీ బెదర గొట్టేయకే! ఎప్పటికివన్నీ తెమలను!" అనగా "పిచ్చిమొద్దూ! ఇవన్నీ నాకూ ఉన్నవే. అన్నీ చక్కబెట్టుకుని నీ వెనకే నేను".... అని మాలతి అనేలోపు "మీ వెనకే నేను" అన్నది వకుళ వారి సందున దూరుతూ.

ఎల్లలులేని ఆకాశమంత విశాలమైన వ్రేపల్లెవాసుల మనస్సులకి ప్రేమ అనే పెరుగును నమ్మకమనే కవ్వంతో చిలికితే భక్తి అనే మజ్జిగ వస్తే అందులో వెన్నముద్దగా కన్నయ్య వారికి దొరికాడు. అది వారిభాగ్యం.

"యమునా నదిలో అరవిచ్చిన కలువ మొగ్గల్లా ఉంటాయికదే వేణువూదేటప్పుడు మన చిన్ని కన్నయ్య అరమోడ్చిన కళ్ళు!" అంత వరకూ ఏం మాట్లాడకుండా ఉన్న నీల అప్పుడంది. మాలతి అందుకుని మన బాల గోపాలుని చేతులు పాదాలు ముఖమూ అన్నీ అందాలొలికే అరవిందాలేనే. మన పనులన్నీ ముగించుకుని రాత్రివేళ యమునాతీరంలో మన మనోనాథుని కలుసుకున్నప్పుడు తన ముద్దు పాదాల మీద పుట్టుమచ్చలైపోవాలని కోరుతూ ఆ పాదాల మీద వాలినప్పుడు..." ఆగాగు! నేను చెప్తాను అంటూ వకుళ "తన సుకుమారమైన చేతులతో మనని లేవదీసి ఎదకు హత్తుకున్నప్పుడు స్వామి హృదయారవిందంలోని అనురాగ మకరందాన్ని గ్రోలే తుమ్మెదలై వాని బిగి కౌగిలిలో బందీలు అయిపోతాము కదే!" అని తన తీయని తలపులను వెలిబుచ్చుతుంటే "సరిసరి! సిరితో కౌగిలిలో ఉన్న సమయంలో, అద్దాలవంటి కన్నయ్యచెక్కిళ్ళలో మన ప్రతిబింబాలు చూసుకుంటూ మురిసిపోతాముగదే!" అని తపతి తన్మయత్వంలో పలుకుతున్నప్పుడు "ఉండవే! నాకో సందేహం కలిగింది. మరి మన చిన్ని కన్నయ్య తన ప్రతిబంబాన్ని ఎప్పుడు ఎక్కడ ఎలాగ చూసుకుంటాడు?" అని మాలతి అనే సరికి నీల నిశ్చయంగా చెప్పిందిలాగ "ఇదిగో ఇలాగ ఇక్కడ మన మనోదర్పణాలలో తన రూపం చూసుకుంటాడు" అని. మాలతి "ఏమోనమ్మా! అదీ నిజమేగాని నేను మాత్రం నా చూపు తిప్పకుండా కన్నయ్యనే చూస్తూ నిలబడతాను. అప్పుడు నా కంటిపాపలో తన అందాలు చూసుకుంటాడులే" అంది. "అందుకే మనందరం మన హృదయాలను స్వామి చేతిలోని మురళిలాగ ఏవీలేని ఉత్తగుల్లగా చేసుకుంటే అందులో అన్ని రాగాలు తానే పలికిస్తాడు. అంతకన్న మనకింకేం కావాలి?" అనుకుంటూ వారందరి మనస్సులొక్కటై, భావనలేకమై, అరమోడ్పు కన్నులతో అద్దాలవంటి చెక్కిళ్ళతో మురళీగానామృత రసాస్వాదనంలో లోకాల నేలే చిన్ని కన్నయ్య రూపాన్ని ధ్యానిస్తూ తన్మయలై నిలచిన వేళ.. స్వామి దివ్య తనూ పరిమళాలు వారిని చుట్టుముట్టాయి. ఆ తావున మధురాతి మధురమై మురళి మ్రోగింది. ధన్యలైన ఆ గోపకాంతలను చూస్తూ, వారి మాటలు వింటూ ఆకాశంలోని చంద్రుడు అక్కడే నిలిచిపోగా, కాలగమనమే ఆగిపోయింది.

మన మనస్సులను బుద్ధీంద్రియానికి అనుసంధానం చేసి చూస్తే బృందావిహారి, గోపీనాథుడైన నందబాలుని దివ్య మంగళమూర్తి చిత్తంలో ప్రకాశిస్తుంది.

-సశేషం

# మౌనధ్యాన సప్తాహశిబిరం

(గత సంచిక తరువాయి) -రమణ ప్రసాద్

ఎవరికి తెలియగ తరమౌను బాబును
ఏ దేశమందుము, ఏకాలమందుము
ఆకాశమునకేది దేశము కాలము

అన్నిటి కన్నా పుట్టడం పెద్ద దోషం అనుకొంటాం. కాని లబ్ధి కూడా ఉన్నది. "జరిగిన దానిని గురించి బాధపడమని చెప్పలేదు. సరే! మానవ జన్మ వచ్చింది. దాని నుంచి బయట పడాలి " అన్నారు గురుదేవులు.

జన్మలదాకా అక్కరలేదు. ఇప్పుడు మనకి వచ్చే సుఖాలు ఎంత సేపు నిలబడుతున్నాయి? ప్రతీదీ క్షణికమే కదా! క్షణికంలో మార్పులేనిది ఒకటి ఉంది. అది పరమాత్ముని బోధ.

మదిలో నీదగు మూర్తి నిల్పుకొని సంభావింతుమేగాని ని
న్నిదమిత్థంబని నిర్ణయింప వశమా? ఎవ్వారికిన్, నమ్మి నీ
పదరాజీవము లాశ్రయించితిమి లోపంబేమి? నీవారమే
గద రక్షింపక నీకు తప్పదు కదా! కాళీప్రసాద ప్రభూ ॥

సముద్రం అంత ఇంకు, ఆకాశం అంత కాగితమూ కూడా భగవంతుని గురించి వ్రాయాలంటే చాలదు. భగవంతుని గురించి కాగితం కలంలో చెప్పలేము. అది అనంతము, అఖండము. నీ పాదాలను ఆశ్రయించాం. మాకు లోటేమిటి? మేము ఎవరి వాళ్ళం? నీ వారమే కదా! నీకు రక్షింపక తప్పదు కదా అని ప్రార్థిస్తున్నాము. కాని మనం ఎంతవరకు నిలబెట్టు కుంటున్నాం? పిల్లల దగ్గరనుంచి ఫోను వచ్చినా బెంగే. రాకపోయినా బెంగే. ఎందుకు రాలేదు అని. కాటికి కాళ్ళు చాచినా బెంగే. ఇప్పుడు వానప్రస్థాశ్రమాలు చాలా వచ్చాయి. మావంటి వారిని చెప్పమంటారు. నేను "అమ్మా! మీ ఇంటి నుంచి ఎవరూ రారా? అంటే అయ్యో వచ్చారండీ"అంటారు. సరే సంతోషం. మనని ఎవరు పంపారు? ఎవరికి ఉండాలి బంధన? మనం మహాత్ముల వద్దకు వచ్చాం. ఇక్కడకు వచ్చాక వెనుదిరుగుతావా? ప్రపంచ దృష్టి వదలి పెట్టు, ఊర్ధ్వదృష్టి ఉండాలి.

"రామా! నీవారము కామా? సకలలోకాభిరామా" అన్నాడు రామదాసు. ఆధ్యాత్మిక దృష్టి అలవరచుకోవాలి. ఏ విద్యావాసనలేని గోపికల నోట ఒకే మాట. కృష్ణుడి గురించిన మాట. మరి భగవంతుడికి రక్షింపక తప్పదుకదా!

వారి కృపచేతనే ఇలా ఇక్కడ నిలబడగలిగాం. ప్రతి విషయంలోను మనస్సు దాస్యం చేస్తోంటే, ఇక ధ్యానం ఎలా కుదురుతుంది!

ఆకాశమునకు ఏది దేశము? కాలము?

ఇది గురుదేవుని ముఖస్థగా వచ్చిన కీర్తన. ఆకాశంలో ఏమీ లేదు. మన ప్రభువు కూడా ఆకాశం వలె ఉన్నారు. రెండు దేశాలు కలిసి ఉన్నాయా? రాష్ట్రాలు ఇంకా కావాలనే మనదేశం కూడా ఇంతే. మానసిక బాధలను ఇంకా రెచ్చగొట్టాలని చూస్తుంది. దిగజారిపోకూడదు. ఊర్ధ్వ దృష్టి కలిగి ఎగబ్రాకాలి. గ్రద్ద పైన ఎగురుతూనే ఉంటుంది. కాని దాని దృష్టి శవాలపైనే ఉంటుంది. మనకు శరీర దృష్టి ఉండకూడదు. అంటే దేహాభిమానం ఉండకూడదన్నమాట.

అర్జునుడి సంగతి చూద్దాం. తనకు ఆవేదన కలిగింది . అంతే, అసలైన ప్రభువు సన్నిధిలో పడ్డాడు. మనకు ప్రతినిధిగా ప్రశ్నలు వేశాడు. అదే గీతాచార్యుడు అందించిన భగవద్గీత. ఆచంద్రార్కం సాధకులందరికీ అందుబాటులో ఉన్నది.

శ్రవణ మనన నిదిధ్యాసనలను సాధకులు అలవరచుకోవాలి. మనం వింటాం. విన్న విషయాలను ఎంత వరకు మననం చేసుకొంటున్నాం? ఇక్కడ నుంచి వెళ్ళాక ఎంత మననం చేస్తున్నాం? మననానికి రావటం లేదు అనేవాడు అధమాధముడు. అది కూడా తేలిక అయిన మాట అందుచేతనే విన్న విషయాన్ని తిరిగి మననం చేసుకోవాలి. విచారణ చేయాలి.

ధ్యానం చేస్తున్నా సంతోషంగా చెయ్యండి. ధీరులుగా ఉండాలి. సుందరాకాండలో వస్తుంది. రావణాసురుడు సీతను బెదిరించాడు. రెండు నెలలు గడువు ఇచ్చాడు. హనుమంతుడు పైనుంచి వింటున్నాడు. సీత వద్దకు త్రిజట వచ్చి స్వప్నం వచ్చింది. మంచి జరగనున్నది అని చెప్పింది. అమ్మవారి ఎడమ భుజం అదిరింది. కన్ను కూడా అదిరింది. అప్రయత్నంగా నవ్వింది. ఫలితం మనదే. చేసే ప్రయత్నం ఆనందంగా చెయ్యాలి. ఈ సమయం నాది. నా గురించి నేను చేసుకుంటున్నాను. దేవుడు నావాడు - అని నమ్మి పట్టుదలతో సాధన చేయాలి.

దేహభావన తొలగించుకుంటేనే జగత్తులో గెల్చినవాళ్ళమవుతాం. కష్టాలు రానవసరంలేదు. ఒకవేళ వచ్చినా తగిన ప్రిపరేషన్ ఉండాలి. అంటే భక్తి, జ్ఞానం అలవరచుకోవాలి. ఈ జీవితమే లేకపోతే భగవంతుడు ఎక్కడ ఉన్నాడో ఏం తెలుస్తుంది?

ఆకాశంలో ఒక అవకాశం ఇచ్చాడు భగవంతుడు. దానిని జారవిడుచుకుంటాం మనం.

ఊహాతీతము నీ లీలా..............

ఊహాపోహాలు మనస్సు వికారం. కాని మనస్సుకు ఆధారం ఆత్మయే. కరెంట్ వల్లే ఫ్యాను తిరుగుతుంది. బల్బు వెలుగుతుంది. కరెంట్ ఉన్నది అనటానికి కనెక్షన్ సరిగ్గా ఉండాలి. అలలతో పొంగు సముద్రమే, ఇవి అకాశం నుంచే వస్తున్నాయి. మన అసలైన తత్వం ప్రశాంతత. చనిపోయిన తరువాత స్థితి కాదు. మరి ఆ శాంతి ఎలా వస్తుంది?

ఒకడు తిరుపతి వెళ్ళాడు. ఏదో ప్రాబ్లెమ్(problem) వచ్చింది. అప్పుడు ప్రశాంతతగా ఉంటుందా? వెంటనే బస్సుపట్టుకుని తిరిగి రావాలని అనిపిస్తుంది. ఒక భక్తుడు జలగలాగా వచ్చాడు జలగాం (అక్కడ ఇటీవల గురుప్రభ పవర్ లిమిటెడ్ సంస్థ ప్రాంగణంలో కట్టిన ఆలయంలో శ్రీగురుదేవులు, శ్రీగణపతి, శ్రీఆంజనేయస్వామి త్రిమూర్తుల విగ్రహ ప్రతిష్ఠా మహోత్సవం శ్రీ మాతాజీవారు చేశారు) అతడు చేసిన తప్పు ఏమిటంటే సెల్‌ఫోన్ దగ్గర పెట్టుకోవటమే. అది మ్రోగింది. వాళ్ళ వదినగారు పోయినట్లు తెలిసింది. నాకు కబురు పెట్టారు. వెళ్ళచ్చా? ఉండవచ్చా? అని. పోయింది అని చెప్పారు కదా. ముందు ఆ సెల్‌ఫోన్ కట్టేయండి. ఆ విషయం నుంచి డిటాచ్ (detach) అయ్యాడు. దూరంగా ఉండి కార్యక్రమం అంతా చూశాడు. మరి వదినగారి కోసం ఏడ్చాడా? ఫోను వచ్చినందుకు ఏడ్చాడా?

మనస్సు తెచ్చే భావనే మనని ఏడ్పిస్తోంది. ఆ భావనలే ధ్యానం నుండి లేపెయ్యటానికి ప్రయత్నిస్తున్నాయి. అప్పుడు మనస్సును భగవద్భావన వైపు మరల్చాలి. కాయిన్(coin) బొరుసు పైకి పడితే బంధన. బొమ్మైతే ముక్తి.

ఊహాతీతము నీలీల............. దానిని తెలియుట ఎవరికి తరము? తరమౌనా?

పవ్వళించెను ప్రళయాంతమందు....... అన్నారు బాబు. అక్కడ పవ్వళించింది ఎవరు? బాబు కాదా? తత్వదృష్టి అలవరచుకోవాలి. తన తత్వం తాను పాడుకొన్నారు స్వామి..... ప్రభువు అందరికీ ప్రభువే.

మనం సాగరాన్ని తల్చుకొందామా? ఆనంద సాగరంలో ఉన్న ప్రభువును గుర్తించాలి.

-సశేషం

## మాతాజీ బోధామృతం

- శివ ప్రసాద్

(దీ. 7-7-2009 ఆషాఢ పూర్ణిమ సందర్భంగా బృందావనంలో శ్రీ మాతాజీవారి అనుగ్రభాషణ సంక్షిప్త రూపం - ఎడిటర్)

మనకు జన్మ కలిగిన నాటినుండి, తిరిగి దేహాన్ని వదలివెళ్ళేవరకు మనము ఉన్నాము అని దేనిని బట్టి తెలుస్తున్నది? జననమరణాలు దేహానికే కలుగుతున్నాయి. వృద్ధిక్షయాలు కూడా దేహానికే ఉన్నై. అవి ఉన్నా పిల్లవాడు పుట్టగానే సంతోషాన్ని వెలిబుచ్చటము, పోగానే బాధగా ఉండటము దేనిని బట్టి కలుగుతున్నాయి? దృశ్య ప్రపంచంలో దేని కొరకు వ్యామోహ పడుతున్నామో, దానిని బట్టే సంతోషము, దుఃఖము కలుగుతున్నై. మనం ఈ రెంటి మధ్యనే ఉన్నాము. కొంతమందికి పిల్లలు పుట్టటం కూడ సంతోషానికి బదులు బాధ కలిగించవచ్చు. కాని అది తప్పుచేసినందువలన పిల్లలు పుడితేనో లేదా పోషించలేకనో అయి ఉంటుంది. అదీ ఇందులో భాగమే. రాత్రి 12గం॥ లప్పుడు సూర్యుణ్ణి చూడాలంటె చూడగలమా? మధ్యాహ్నం 12గం॥లప్పుడు చీకటిని చూడగలమా?అది రాత్రే వస్తుంది. దేహం మీద దృష్టి ఉన్నంతవరకు దేహధారులకు ఈ రెండూ తప్పవు. ఆనందం ఎప్పుడు వస్తుంది? నీలో ఉన్న చైతన్యాన్ని గుర్తించి అది నీవే అని తెలుసుకున్నప్పుడు. ఇవ్వాళ ఆ పెద్దావిడ పోయారు. అయినా అందరూ ఆనందించారు ఎందుకూ? ఆ మామ్మగారు గురుసాయుజ్యం పొందారుగనుక అందరూ ఆనందించారు.

గురువు అనేది అవ్యక్త స్వరూపం. సగుణానికి నిర్గుణం పునాది అయి ఉన్నది. ఆ నిర్గుణాన్ని గుర్తించే వరకు అందరూ ఈ సంతోషము, దుఃఖములకు రాగము, ద్వేషములకు మధ్య సతమతమవుతుంటారు. ఎవరు గురువు చెప్పింది శ్రవణం చేసి సాధన ఇనుమడింపచేసుకుంటారో, వారు ఆనందాన్ని పొందు తారు. ఆ మామ్మగారు రాత్రిరెండుగంటలకు లేచి ఇవ్వాళ్ళ వ్యాసపూర్ణిమ, ఇంకా స్నానం చేయించలేదెందుకు? త్వరగా పూజ దగ్గర ఉండాలి అన్నది. ఆమె మనస్సులో ఏమున్నది? గీతాచార్యుడు మనస్సులోని సంకల్ప వికల్పాలవలననే మనం బాధింపబడుతున్నాము అని చెప్పాడు. మన సుఖసంతోషాలకు కూడా ఆ సంకల్ప వికల్పాలే కారణం. అందుకే మనం సంకల్పంలో జీవన్ముక్త్యర్థం అని చెప్పుకుంటాము.

జీవించి ఉండగానే చచ్చిపోయిన వాడికి తిరిగి జన్మ లేదు. అది జన్మ రాహిత్య స్థితి. దానిని గుర్తించాలి. గుర్తించేదానికి కారణం ఏదైౖ ఉన్నది? గురువుల దగ్గరకు వెళ్ళినా, ఏ దేవుడి దగ్గరకు వెళ్ళినా, నా తను, మన, ధనములకు నీకు అర్పిస్తున్నాను అంటారు. తనువును పోషించటానికి, గుర్తింపచేయటానికి ఒక మనస్సు అవసరం. గుర్తించిన తరువాత మనస్సు ఏమౌతుంది? మంత్రం మననం చేయటం ద్వారా, మంత్రం వేసిన పాములాగ అది అణిగి ఉంటుంది. సర్వకాల సర్వావస్థలలో నీవు ఆశ్రయించిన పాదం తప్ప ఏదీ మిగిలి లేదు.

కాయము, వాక్కు, మనస్సు ఈ మూడు త్రికరణములు. ధనం మీద వ్యామోహం పోతేగాని వాటిని త్రికరణశుద్ధిగా భగవంతుడికి గాని గురుదేవులకుకాని అర్పించలేరు. తమనుతాము అర్పించాలి అంటె ధనం ఇచ్చినంత మాత్రాన చాలదు. అయినా అంతా ఇస్తారా? ఇస్తే రేపటి రోజు ఏమౌతుంది అని ఆలోచించరా? ఒకవేళ ఇచ్చినా ఇక్కడ తేరగా ఎవరు కూర్చుని ఉన్నారు తీసుకోవటానికి? అసలు ఆ ధనం నీకు ఇచ్చింది ఎవరు? అసలు ఇది ధనం అని ఎవరు ఉంటే గుర్తిస్తున్నావు? నీవు నిద్రపోతుంటేనే నీకు ఏమి తెలియటంలేదు.

గురుదేవుల బోధను కేవలం తలచుకోవటమే కాదు, దానిని ధారణ చేయాలి. ధారణ చేయటం అంటె ధరించటం. అంటె చీరలు, ధోవతులు కట్టుకున్నట్లు కాదు. ఈ తోలు కూడా ఎన్నో రూపాలు ధరించింది. మా అమ్మా, మా నాన్నా నా చిన్నప్పుడు నాకు ఒక గౌను కుట్టించి ఇచ్చారు. చాలా బాగుందని దాచుకున్నాను. బాగుంది కదా, ఇప్పుడు వెసుకుందాము అంటె, చేయికూడ పట్టదు. తనువు పుట్టినప్పటినుండి దానిలో ఎన్నో మార్పులు వచ్చాయి. ఇంక ఒక్కటే మిగిలి ఉన్నది. అదే నాశనం. అది చిన్నప్పుడే కావచ్చు. లేదా యౌవనంలో ఉండవచ్చు. వృద్ధాప్యం తరువాత మాత్రం అది తప్పక వస్తుంది. నాశనం అనేది ఎప్పుడో ఒకప్పుడు తప్పక వస్తుంది.

ప్రొద్దున స్నానం చేయించి పంపించారు మామ్మగారిని. రాత్రి ఎందుకు పంపించలేక పోయారు మామ్మని అంటే అప్పుడు అందులో ప్రాణరూపంలో చైతన్యం ఉన్నది కనుక. ఇప్పుడామె ఇంట్లో లేదు. ఆమె దేహాన్ని బయట పడుకోబెట్టారు. కాని ఆమె బాబులో ఉన్నది. ఎంత అదృష్టవంతురాలో! ప్రతి ఆషాఢ పూర్ణిమకు ఆమె తప్పక గుర్తువస్తుంది.

దేహాన్ని విడిచిపెట్టటమే ముఖ్యం కాదు. పుట్టుక, చావు ముఖ్యం కాదు. బ్రతికి ఉండగానె ఇది నిత్యం కాదు అని సాధన చేసి ఏది నిత్యమైనదో

దానిని సాధించాలి. ఆ వస్తువు మాత్రం నిత్యమై ఉంటుంది. గురుభక్తులకు ముఖ్యమైన పండుగలు ఈ గురుపూర్ణిమలు.

మనం చేయవలసిన ఖాళీ మనస్సులో చేసుకోకుండా, నా మనస్సు భారంగా ఉంది అంటే ఎలా? మన ఇల్లును రిపేర్(repair) చేయాలంటేనో, రంగువేయాలంటేనో, సామాన్లు బయట పడేస్తాము. దుమ్ములు దులుపుతాము. అంతా అయిన తరువాత అనవసరమైన సామాన్లు పారేసి, అవసరమైనవి లోపల సర్దుకుంటాము. అలా సర్దుకున్న తరువాత ఎంత హాయిగా ఉంటుందో! ఎంత ఆనందంగా ఉంటుందో!

పరిచయాలు పెరుగుతాయి. అబ్బా! ఆ ఇంట్లో పెద్ద టీవీ ఎంత బాగుందో! ఆ భక్తి ఛానల్ కూడా ఆ పెద్దటీవి మీద చూస్తే ఎంత బాగుంటుందో అనిపిస్తుంది. ముందరే సీరియల్స్ మీదకి పోదు మనస్సు. భక్తి ఛానల్ పేరుతో పెద్ద టీవి ముందు వస్తే తరువాత రోజంతా ఎలాగూ ఆ సీరియల్స్ చూడవచ్చు కదా! ముందే సీరియల్స్ అంటే పెద్ద టీవి రాకపోవచ్చు. సీరియల్ అంటే ఎండ్(end) లేనిది. నిన్నటికి ఇవాళ సశేషం అనవచ్చు. కాని రేపు మనముంటామని గ్యారంటీ ఏమిటి?

ధర్మరాజుగారికి ఒక సమస్య వచ్చింది. ఎవరో యాచించటానికి వచ్చారు. ధర్మరాజు 'అబ్బాయ్! రేపు రా' అన్నాడు. ధర్మరాజు తమ్ములెవ్వరూ ఆయన మాటను జవదాటరు. ధర్మరాజు అన్న మాటలు ఆయన వెనక ఉన్న భీముని చెవిలో పడ్డాయి. వెంటనే అతడు సంతోషంతో 'అంటే అన్నగారు రేపు కూడా ఉంటారు అన్నమాట. అయితే ఇక భయంలేదు' అని భీముడు వెంటనే ఆ విషయం చాటింపు వేయించాడు. చాటింపు వేసిన విషయం ధర్మరాజుగారి దాకా పోయింది. ఆయన చాటింపు వేసినవాడిని పిలిచి, 'ఎవరు వేయించారు?' అని అడిగాడు. వాడు భీమసేన మహరాజుగారు వేయమన్నారు అని చెప్పాడు. ధర్మరాజు భీమసేనుణ్ణి పిలిచి చాటింపు విషయం అడిగాడు. భీమసేనుడు 'అవును మహారాజా! రేపటి రోజు మనదా? అయినా మీనోటి నుండి ఆ యాచకుణ్ణి రేపు రమ్మని మాట వచ్చింది. మీ నోటి నుండి అసత్యము రాదు కనుక రేపు మీరు, ఆ యాచకుడు తప్పక ఉంటారు. అందువలననే చాటింపు వేయించాను' అన్నాడు. ధర్మరాజుకు వెంటనే కనువిప్పు అయింది. అతడు ఆ యాచకుణ్ణి పిలిపించి, ఇవ్వవలసింది ఏదో ఇచ్చి పంపేశాడు.

-సశేషం

# మాతాజీ సత్సంగ్ డైరీ

(గతసంచిక తరువాయి) -రమణ ప్రసాద్

(ఏప్రిల్17నుండి19 వరకు విజయవాడలో జరిగిన సత్సంగ కార్యక్రమాలలో 19వతేదీన బ్రాహ్మీ ముహూర్తంలో శ్రీ వై. వీర్యగారి ఇంట్లో, విజయవాడ, వాసవ్యనగర్‌లో శ్రీ మాతాజీ వారు చేసిన **ప్రబోధమును** సంగ్రహంగా ఇక్కడ ప్రచురిస్తున్నాము - ఎడిటర్)

మనకు ధ్యానంలో అడ్డవచ్చేవి మనలోనే ఉన్నై అని వాటిని వివేక వైరాగ్యాల ద్వారా దూరం చేసికోవాలి అని చెప్పుకున్నాము. శాస్త్రం మాత్రమే వస్తే, చెప్పుకోవటం మాత్రమే వస్తే చాలదు. వారు మాయనుండి బయట పడలేరు. వివేకదృష్టి ద్వారా విషయాలమీద వైరాగ్యం రావాలి. ఉపవాసం చేయాలనుకొనేవారికి గురుదేవులు చక్కెరగాని, చట్నీగాని ఏమీ లేకుండా ఉత్త ఇడ్లీ తిని ఉండమనేవారు. వారు తినాలని ఉన్నా, పచ్చడి లేకుండా, సాంబారు లేకుండా, కనీసం చక్కెర అయినా లేకుండా ఏం తింటాము, ఎంత తింటాము అనేవారు.

ఉప్పు ఉంటే ఇడ్లీ విషయమై కూర్చుంటున్నది. పక్కన ఆధరువులు బాగుంటే అప్పుడు, ఒకటి రెండూ కాదు వెళ్ళేది. నాలుగు దగ్గర కూడ ఆగరు, ఉపాహారమేగా, ఇడ్లీ ఎన్నైనా తినవచ్చు అనుకుంటారు. టిఫిన్‌ను టిఫిన్‌గా తినాలి. నేను రాత్రి టిఫిన్ తింటాను, కాని టిఫిన్‌లా తింటాను. ఒకవేళ రాత్రి భోజనం చేయవలసివస్తే దానిని కూడ టిఫిన్‌లా తింటాను. మీరు టిఫిన్‌ను భోజనం చేసినట్లుగా తింటారు. మనం కూర, పచ్చడి, పప్పు మొదలైనవన్నీ విడివిడిగా కలుపుకొని తింటాము. ఎందుకు? మనం రుచులకు అలవాటు పడ్డాము. మనకు రుచులు కావాలి.

సాధకులకు మితాహారం, మిత నిద్ర, మితభాషణ తప్పక ఉండాలి అనేవారు గురుదేవులు. వారికి మనమంటే మహాప్రేమ. దానికి అవధులు ఉండేవికావు. కాని ఏదైనా విషయం వచ్చినప్పుడు మాత్రం వారివైపుకు చూడాలంటే కూడ భయం వేసేది.

మితాహారం, మిత నిద్ర, మితభాషణం మూడూ ఉండాలి. మనకు వాటిమీద కంట్రోల్ ఉండాలి. ఏదిముందు? ఏదో ఒకదానితో మొదలు పెడితే మిగిలిన రెండూ అవే తన్నుకుంటూ వస్తాయి.

మితభాషణకుముందు మౌనం అలవరచుకోవాలి. మౌనానికి భాషలు ఎక్కువ. మనం కళ్ళుమూసుకొని కదలకుండా కూర్చొనే ఉంటాము. కాని 'లోపల ఎవరో ఉండి నన్ను చెరచుచున్నట్లు తోచుచుండె రక్షింపరాదె.' దీనికన్న, అంటె ఈ మనస్సుగాడికన్న గొప్ప అశాంతిని కలిగించేవాళ్ళు ఇంకెవరు? కూర్చొని హాయిగా ఉంది అనుకుంటాము. కాని కళ్ళు మూసుకోగానే మనస్సు మొదలుపెడుతుంది. అవి మూడూ అంటే మితాహారం, మితభాషణ, మిత నిద్రలైన్లోకి రాగానే వివేకం వస్తుంది.

అవి కంట్రోల్‌లోకి రావాలి అంటే మరీ నీరసం వచ్చేటంత తక్కువ తినకూడదు. ఆఖరికి మాట్లాడటానికి కూడ శక్తి ఉండదు. అలా అని నిద్ర వచ్చేటంత తినకూడదు. నీరసం రానంత మితం, నిద్రరానంత మితం. ధర్మంగా జీవిస్తూ, మితాహారం, మితభాషణం, మితనిద్ర అలవరచుకుంటే నిత్యానిత్య వస్తువివేక దృష్టి వస్తుంది. దీనికోసం మనం మొదట బాగా శ్రవణం చేయాలి. మనందరం శ్రవణంలోనే ఉన్నాము

ఉన్న దానిని మనం కదలికలతో ఉపయోగిస్తాము. కాని అలాకాక కంట్రోల్‌తో కదల్చాలి. లోపల దాన్ని కదలనీయక శరీరాన్ని కదిలిస్తూ కర్మలు చేయాలి. మనస్సు చేతిలో మనం ఉండకూడదు. మనస్సు మన కంట్రోల్‌లో ఉండాలి. అది వివేక దృష్టి. దాని ద్వారా వైరాగ్యం వస్తుంది.

దేనికి ఇదంతా? రోజూ తెల్లవారు జామున మనకు వైరాగ్యం వస్తూనే ఉన్నది. రాత్రి తీసుకొన్నది తెల్లవారు జామున బయటకు పోతుంటే మనకు దానిమీద ఏమైనా జాలి కలుగుతున్నదా? అయ్యో అది మననుండి వెళ్ళిపోతున్నదే అని బాధ కలుగుతున్నదా? మనలోనే ఉంటే బాగుండును అనిపిస్తున్నదా? ఏ విషయమైనా అది ఎంతవరకు అవసరం? మనం దానిని అనుభవిస్తున్నామా? అది మనను అనుభవిస్తున్నదా? ఆహారాన్ని మనం భుజిస్తున్నామా? అది మనను భుజిస్తున్నదా? మనమే దానిని భుజిస్తుంటే కొంతకాలం తర్వాత శరీరం పెరగటం మాని ఎందుకు క్షీణిస్తున్నది? అదే మనను భుజిస్తున్నది.

ఏమీ చేయనట్లు బయటకు కనిపించటం మాత్రమే చేస్తే చాలదు. కొంతమంది కళ్ళుమూసుకొని కదలకుండా కూర్చొని మనం ఏమీ చెయ్యటం లేదు అనుకుంటారు. కాని వారికి వ్యవహారమందు వ్యసనం ఉంటుంది. ఆ 'డీల్'(deal )ఏమైందో? ఆ విషయం ఏమైందో? ఆ వ్యవహారం పరిష్కారం అయిందో లేదో? ఇవే ఆలోచనలు. మనం కదలకుండానే కూర్చొని ఉన్నాము.

అయినా అవన్నీ మనస్సులోనుండి వస్తూనే ఉన్నాయి. అందుకే గురుదేవులు అప్పుడప్పుడు కొందరిని 'నీవు ఇక్కడ కూర్చున్నా, నీమనస్సు ఇక్కడ నిలవదుగాని, నీవు వెళ్ళిముందు ఆ పని చూసిరా' అనేవారు. మనస్సు మన కంట్రోల్‌లోకి రావాలి. అప్పుడు వివేక దృష్టి వస్తుంది. మనం మనకు దేనికీ పనికిరాదు అనుకొన్న ఒకదానిని చూపించి, గురుదేవులు ఏదో ఒకరోజు ఇది నీకు అవసరం అవుతుంది, దీనిని జాగ్రత్తపరచు అనిచెప్పేవారు. వారిది వివేక దృష్టి . నీ మనస్సు ఏప్పుడూ గురుదేవులయందే నిలచి ఉంటే, ఆ వివేకదృష్టి కలిగి, దానిద్వారా ఇహాముత్రఫలాభోగ విరాగం వస్తుంది.

మొదట వివేక దృష్టి . విషయాలలో పదార్థభావనపోయి, వివేకదృష్టి ఎప్పుడువస్తుందో అప్పుడు 'ఇహ' అంటే ఈ లోకానికి సంబంధించినవిగాని, అముత్ర అంటే పరలోకానికి సంబంధించినవిగాని, అన్ని సుఖాలమీద వైరాగ్యం కలుగుతుంది. అబ్బా ఇంద్రసభలాగా ఉందండీ అనో ఇంద్రభోగాలు అనుభవిస్తున్నారు అనో, ఇంద్రవైభవంగా పెండ్లి చేశారు అనో అంటారు. వారేమన్నా ఇంద్రసభను, ఇంద్రభోగాలను చూసి వచ్చారా? పరలోక సుఖాలు గొప్పగా ఉంటాయని ఊహించుకుంటున్నాము.

నీవు నీ లోకాన్ని ఇక్కడే ఏర్పాటు చేసుకో. నీవు పొందే విషయాల యందు సమదృష్టి కలిగి ఉండు. గురుదేవులు మనకు, తమపాదాల ఆశ్రయాన్ని ప్రసాదించారు. ఆ పాదాలకు భక్తితో నమస్కరిస్తుంటేనో, లేదా దండ వేస్తున్నప్పుడో మనస్సు ఎక్కడకు వెళ్తోంది? అప్పుడు అక్కడ ఈర్ష్య, ద్వేషము, అసూయ, అసహనము, ఓర్వలేనితనమూ ఉండవు. తత్పరత, భయము, భక్తి ఉంటై. మళ్ళీ మనకు సమయం దొరకదు, ఇప్పుడు వెళ్ళి స్వామికి నమస్కరిద్దాము అని వెళ్ళి నమస్కరించటానికి వీలులేదు. అక్కడ 'ఉ' అనటానికికాని 'అ' అనటానికికాని వీలులేదు. స్వామి గట్టిగా ఊ అన్నారంటే రెంటికి వస్తుంది.

అనాడు మనం రికగ్నైజ్(Recognize) చేశామోలేదోకాని, స్వామి పాదాల వద్ద ఉన్న పూలు 'మేము ఏరాజకీయ నాయకుడి మెడలోకో పోవలసిన వాళ్ళం, ఈ స్వామి వద్దకు చేర్చావు' అని కృతజ్ఞత తెలుపుకుంటున్నై. మనంకూడ మహాత్ముల పాదాలవద్దకు చేరవలసిన పుష్పాలం. ఆ పుష్పాల ఆయుస్సు ఎంతో మన ఆయుస్సుకూడ అంతే. ఆ పుష్పాన్ని చెట్టునుండి వేరుచేసినట్లే, మనం తల్లి గర్భంనుండి వేరుచేయబడి వచ్చాము. స్వామి పాదాల సన్నిధి చేరిన తర్వాత మనం ఏమి చేస్తున్నాము? -సశేషం

# శ్రీ బాబూజీ దివ్యవాణి

చరిత్ర కందని అతి ప్రాచీన కాలం నుంచి కూడా, అఖండ ఆధ్యాత్మిక విజ్ఞాన సంపత్తికి అత్యంత ప్రఖ్యాతి గడించిన అమర భూమి మన యీ భారతావని. ఆధ్యాత్మిక సంపత్తికే కాదు, 'రత్నగర్భ' అనే పేరుతో, పలువిధాలైన భౌతిక సంపద్విశేషాలకు కాణాచియై, దేశదేశాలవారిని నిరంతరమూ వేర్వేరు కాలాలలో వ్యామోహపెట్టి అకర్షిస్తూ వచ్చినది కూడా ఈ మన మాతృభూమియే.

భారతదేశపు రత్న రాసులను కొల్లగొట్టుకొని పోవడానికై ఎందరెందరో విజాతీయులీ దేశముపై దండయాత్రలు కొనసాగించడం జరుగుతూ వచ్చినది. కాని, అలా కొల్లగొట్టి హరించుకొని పోవడానికి శక్యమైనది కాదు మన భారతీయ ఆధ్యాత్మిక సంపద. అది యేకాలమందైననూ ఇచట జన్మిస్తూ ఉండే మహాత్ముల రూపంలో తరగని పాతరగా విలసిల్లెడి మహాసంపద. భారతదేశానికే గాక, యావత్ప్రపంచానికి తమ దివ్య రోచిస్సులను ప్రసరింప జేయగల జ్యోతిస్స్వరూపులు వారు. వేదకాలం నుండీ వెలుగుతూ వచ్చిన ధర్మజ్యోతిని ఆరనీయకుండా కాపాడుతున్నది వీరే.

ఈ పుణ్యభూమిలో హిందువులని సామాన్యంగా పిలువబడే వారి నడవడికి అనాదిగా ఏడుగడయై ఉంటూ వచ్చిన కారణంచేతనే ఈ ధర్మానికి హిందూ ధర్మమనే పేరు చలామణిలోకి వచ్చినది. వేదమే ఈ ధర్మానికి మూలం. ఈ వేదమంత్రాలు మానవ బుద్ధి కల్పితాలు కావు. అతీంద్రియ ద్రష్టలైన ఋషులు తమ తపస్సమాధి యందు అంతః శ్రవణంతో విని నేర్చినవి. కావుననే వీటిని 'శ్రుతు'లన్నారు. మానవ బుద్ధికి అతీతములైన దివ్య సత్య ప్రబోధములవి. ఇట్టి దివ్య విజ్ఞాన సాధనమును కనిపెట్టండంలోనే ఉంది వేద ఋషుల విశిష్టత.

ప్రతి హిందువు - హిందువే కాదు, ప్రతి మానవుడూ కూడా ఎట్టి నడవడిని అలవరచుకోవలెనో ఈ వేద వాక్కులు మనకు హెచ్చరిక చేసి యున్నాయి. 1) 'సత్యం వద' - సత్యమునే పలుకుము, 2) 'ధర్మం చర' - ధర్మమునే అనుష్ఠించుము, 3) 'మాతృ దేవో భవ', 'పితృ దేవోభవ', 'ఆచార్య దేవోభవ', 'అతిథి దేవోభవ' - తల్లిని, తండ్రిని, గురువును, అతిధిని దైవ సమానులుగా భావింపుము. 4) 'కాపట్యం న కుర్యాత్', - కపటంగా ప్రవర్తించకుము, 5) 'ఆత్మ హితం ఆచరేత్', - నీకు శ్రేయస్కరమైన మార్గమునే అనుసరించుము, 6) 'గురుం న వదేత్', - గురు నామము నుచ్చరింపకుము,

అనగా, గురువునెడ అత్యంత భక్తి యుక్తుడవు కమ్ము. 7)'అభక్తాయ న ప్రకాశయేత్' భక్తి హీనులతో సంగతిని విడనాడుము, 8) దైవం పట్ల పరమ భక్తి యుక్తుడవు కమ్ము' - ఈ విధమైన వేదచోదిత దివ్య బోధలయెడ ప్రతి మానవుడూ శ్రద్ధాళువు కావడం అత్యంతావశ్యకం.

మానవుడు అమృత స్వరూపుడెట్లు కాగలడో కూడా వేదం వివరించియున్నది. 'న కర్మణా,న ప్రజయా ధనేన, త్యాగేనైకె అమృతత్వ మానశుః', - కర్మలచేతగాని, సంతానం చేతగాని ధనముచేత గాని గాక, త్యాగంచే మాత్రమే మానవులు అమృతత్వాన్ని పొందగలరు. ఇక్కడ త్యాగం అంటే ఏమిటి? త్యాగం అనగా స్వార్థత్యాగం. తాను చేసెడి కర్మ ఫలత్యాగం, స్వకుటుంబంనెడ రాగబంధ త్యాగం, ధనాదులయెడ లోభత్యాగం.

హిందూ ధర్మానికి, - భారతీయ సంస్కృతికి, - వెన్నెముకగా చెప్పుకో దగిన ముఖ్య సూత్రములివియే. హిందూ ధర్మం అనేది సంకుచితమైన ఒక మత విధానం కాదని దీనివలన సుస్పష్టం. ప్రపంచంలోని అన్ని మతాల ఉదాత్త బోధలూ ఈ ధర్మసూత్రాలలో ఇమిడి ఉన్నాయి. ఇది ఏ ఒక జాతికి, ఏ ఒక మతానికి, ఏ ఒక కాలానికీ పరిమితమైనది గాక, ఎల్ల జాతులవారికీ, ఎల్ల మతాలవారికీ ఎల్ల కాలాలవారికీ వర్తించగల సార్వజనీన ధర్మం.

ఈ హేతువుచేతనే, భారతదేశంలో, వివిధ మతాలకూ జాతులకూ చెందినవారెందరో హిందూ సమాజమునందు అంతర్భూతులుగా లీనమైపోవుట సంభవించినది. హేతుబద్ధమూ, యుక్తియుక్తమునైన దృక్పథము ననుసరించి ఈ అనన్య సాధారణమైన యోగ్యత దీనికి అలవడినది. తమలో అంతర్భూతులు కాగోరి వచ్చినవారెల్లరికీ విశాల హృదయములతో హిందువులు స్వాగతం పల్కినారు. అట్టి వారియెడ సహనభావం కలిగియుండుటేగాక, ప్రేమ సౌహార్దముతో సైతము వారిని ఆదరించినారు.

ఇహ పరములు రెంటినీ సమన్వయించి శ్రేయో మార్గమును నిర్దేశించి చూపగలిగినది హిందూ ధర్మము. గుంటూరు జిల్లా నంబూరు వద్ద గల కాళీగార్డెన్స్‌లోని శ్రీబాబూ విజ్ఞాన మందిరమందు శిష్యజన వాత్సల్యంతో వేంచేసియున్న శ్రీ హనుమత్ కాళీ వర ప్రసాదబాబుజీ ఈ హిందూ ధర్మ వైశిష్ట్యాన్ని గురించియే వరుసగా కొన్ని దివ్య ప్రబోధాలు చేశారు. *

# సమర్థ సద్గురు నాథుని దివ్య చరిత్ర

(గత సంచిక తరువాయి) - స్వామి విజయేశ్వరానంద ప్రసాద్

నీల మేఘ ఛ్ఛాయతో, సన్నగా చురుకుగా ఉన్న దేహంతో , తీక్షణములై తేజోవంతములైన కన్నులతో, ముక్కుకు కాడతో, చెవులకు తమ్మంట్లతో, కాలికి తోడాతో, నీలి రంగు పట్టుబట్టలు ధరించి "సాధువుగారు" (ఆ రోజుల్లో వారిని అలా పిలిచేవారు.) కనబడితే ఎవరూ ఆయన కళ్ళలోకి సూటిగా చూడగలిగేవారు కాదు. వారి పాదాలను తాకాలన్నా, ఏదన్నా మాట్లాడాలన్నా బెరుకు బెరుకుగా ఉండేది. కాని స్వామి పలుకులలో మాత్రము ప్రేమ, వాత్సల్యం, కరుణ తొణికిస లాడేవి. వచ్చినవారు పిన్నలైనా, పెద్దలైనా, ఏ కులంవారైనా శ్రీబాబు వాళ్ళతో ఎంతో ఆదరము,



వినయము, వినమ్రత ఉట్టి పడేటట్లుగా సంభాషించేవారు. ఆ ఆత్మీయతను, ఆప్యాయతను, అందుకున్నవారు తమ్ము తామే మరచిపోయేవారు.

ఆ రోజులలో వారి మాట నంగిగాను, ముద్దగాను ఉండేది. జాగ్రత్తగా వింటేగాని అర్థమయ్యేది కాదు. అయినా, ఆ వాగ్ధోరణితోనే వారు ఎన్నో సందర్భాలలో ఎంతోమంది పండితులతోను, వేదాంతులతోను, సాధువులతోను, జిజ్ఞాసువులతోను, సంభాషించేవారు. సుదీర్ఘంగా చర్చలు జరిపేవారు. తత్త్వ విచారణ చేసేవారు. అసత్యమును, శాస్త్రానికి అనుభవానికి విరుద్ధమైన వాదములను ఖండించేవారు. సత్యమును, తత్త్వమును నిరూపణ చేసేవారు. ఎన్నో నిగూఢ శాస్త్ర విషయములను, వేదాంత రహస్యములను ఆత్మ తత్త్వ మర్మములను, విపులంగాను, తేటతెల్లంగాను విశదీకరించి చెప్పి ఒప్పించేవారు.

ఒకానొక సందర్భంలో శ్రీ బాబుతో సాంగత్రివేదాచార్యులైన మహాపండితులొకరూ, నేనూ కూడా ప్రయాణిస్తున్నాము. శ్రీబాబు వేదశాస్త్ర పాండిత్యమునకు, ఆత్మానుభవమునకు గల తారతమ్యాన్ని విశదీకరించి చెప్పారు. ఎంతో శ్రద్ధగా ఆసాంతమూ విన్న ఆ పండితులు ఆనంద బాష్పాలతో

“బాబూ! అరవై సంవత్సరాల సుదీర్ఘ కాలం వేదాధ్యయనం చేసి నేను అందుకొనలేక పోయిన ఉపనిషద్రహస్యాన్నీ, పొందలేక పోయిన ఆత్మానుభవ మాధుర్యాన్నీ తమరు అరవై నిమిషాలలో అరటిపండు ఒలిచి యిచ్చినట్లు అందించారు. ధన్యుణ్ణి” అన్నారు. అటువంటి వేదాంత చర్చా సమయములలో, వారికి మాట నంగిగా కాక ధారాళంగా వచ్చేదని స్వామి చెప్పారు. అప్పుడప్పుడు శ్రీబాబు, తమ నాలుక ఆ రోజులలో ఎలా ఉండేదో బయటకు చాపి చూపించేవారు. నాలుక చివర ముద్దగా, వెడల్పుగా కనిపించేది. (ఆయన అల్లా పెట్టేవారు!) “దయామయి అయిన జనని ‘నా తత్వాన్ని నువ్వు లోకమంతటా వెదజల్లాలిరా’ అని దీవిస్తూ, నా నాలుకపై బీజాక్షరాలను వ్రాసింది. అప్పుడు నా మాటలు నంగిగా ఉన్నా, తరువాత ధాటిగానే వస్తాయని మా అమ్మ చెప్పింది” అనేవారు. ఆ ధాటి భక్తులందరికి నిత్యానుభవంగా నిలిచింది.

మహర్షి పుంగవులైన శ్రీ ప్రభుదత్త బ్రహ్మచారిగారు శ్రీబాబు యెడల అమితమైన ఆదరణ కలిగి ఉండేవారు. వారు ఒకసారి శ్రీకాళీగార్డెన్స్ ఆశ్రమానికి విచ్చేసినప్పుడు శ్రీబాబును “మేరా కృష్ణ” అని కౌగలించుకుని “తుమ్హారే భాషణ్ బహుత్ మీఠా హై క్యోం కి యహ్ స్వానుభవ్‌కే అమృత్ సే మిలిత్ హై” అన్నారు. (మీ భాషణము స్వానుభవమనే అమృతముతో కూడినది కనుక ఎంతో మధురముగా ఉంటుంది.) మన స్వామిది కేవలము స్వానుభవ ప్రకాశితమైన జ్ఞానము. అది హిమాలయములకే మకుటాయమానమైన గౌరీ శంకర శిఖరము వంటిది. దాని ఔన్నత్యము ముందు, ధాటి ముందు, వాచా వేదాంతులు, అనుభవ జ్ఞానహీనులు అయిన వారి వాదము లెక్కడ నిలువ గలవు? ముక్కు పచ్చలారని ఈ బాలుని అనుభవ మాధుర్య మిళితములైన అమృత గుళికల ముందు వారి శుష్క తర్కాలాపములు, తమ ప్రశ్నలకే తాము జవాబు చెప్పుకోలేని వారి మిడిమిడి జ్ఞానపు పలుకులు, చెరకు తీపి ముందు చెత్త వంటివి. అహంకారము, ఆడంబరము, ఆయాసము ఆ పండితుల సొమ్ము. ఆచరణ, ఆనుభవము, ఆనందము స్వామి సొమ్ము.

ఆ రోజులలో శ్రీబాబును సాధువు గారని, సిద్ధాంతి గారని, కాళీబాబు గారని పిలిచేవారు. చాటుమాటున తమను విమర్శించే వారిని శ్రీబాబు తమాషాగా ఏడిపించేవారు. వాళ్ళు మాట్లాడుకున్న మాటలు, టైము, స్థలము, ఎదురుగా ఉండి చూసినట్లు శ్రీబాబు చెప్పుకుని పోతుంటే, వాళ్ళు గుడ్లప్పగించి చూస్తూ నిలువునా నీరైపోయేవారు. ఎదుట ఉన్న వ్యక్తి చరిత్ర స్వామికెదురుగా,

తెరచిన పుస్తకం వలె కళ్ళకు కట్టినట్లు కనిపించక పోతే, అలా ఎలా చెప్పగలరు? కాని శ్రీ బాబు "ఇదంతా నాకు అమ్మ చెప్పింది. లేక పోతే నాకేం తెలుసు? అమ్మది విశ్వ చక్షువు, విశ్వ కర్ణము, సృష్టిలో ఏ మూల ఏమి జరిగేది ఆమెకు కనబడుతుంది. ఎవరేమి అనుకునేది ఆమెకు వినబడుతుంది''అనేవారు. నిజమే! అటువంటి అమ్మ, శ్రీబాబు హృదయ మందిరంలో నిరంతరము ఆనంద తాండవం చేస్తూ ఉంటుంది గనుక, మనందరికి శ్రీబాబు చక్షువు విశ్వచక్షువు, శ్రీబాబు కర్ణము విశ్వకర్ణము.

శ్రీ బాబు సుదీర్ఘ పర్యటన కాలంలో సుసంపన్నులు, జమీందారులు, ఆస్థాన ప్రభువులు వారికి ఆతిథ్యమిచ్చి ఆదరించిన సందర్భాలెన్నో ఉన్నాయి. అలాగే నిరుపేదలు, అన్నికులములవారు, కోయజాతులవారు, కొండజాతుల వారు వారికి ఆతిథ్యమిచ్చి ఆరాధించుకున్న సంఘటనలూ ఎన్నో ఉన్నాయి. ఆ సంపన్నుల యిళ్ళలోని పంచభక్ష్య పరమాన్నములు, ఈ నిరుపేదల యిళ్ళలోని పచ్చడి మెతుకులు, రెండిటినీ శ్రీ బాబు సమదృష్టితో అందుకొని, పరమప్రీతితో ఆరగించారు. స్వామి ఆస్వాదించింది ఆయా గృహస్థుల ప్రవిమల భక్తి మాధుర్యమేగాని పదార్థముల ఆడంబరము కాదు. తమ సాధనకాలంలోనే కాదు, తరువాత కూడా సుసంపన్నులు కమ్మని నేతితో చేయబడిన అతిరుచ్యములైన మధురభక్ష్యాలు ఎంతో ఆడంబరంతో ఎన్నో తెచ్చి శ్రీబాబుకు సమర్పించినా, దృష్టిమాత్ర నివేదనముతోనే సరి పెట్టేవారుగాని, ఏ పేదరాలో, ఏ వెఱ్ఱిబాగుల భక్తులో తమ శక్తి మేరకు సంకోచిస్తూ కొనితెచ్చిన బఠానీలో, వీధి బండిలో కొన్న పకోడీలో , అటుకులో ఆత్రంగా అడిగి పుచ్చుకొని, అత్యాదరంతో తాము ఆరగించి, అక్కడి భక్తులందరికి "ఇది నిజమైన భక్తిమాధుర్యంతో కూడిన మహా ప్రసాదం. ఒక్క రేణువుకూడా పోనీయకుండా తీసుకోండి'' అని పంచి పెట్టించేవారు. ఇంతటి భక్త పరాధీనత ఆ పరమేశ్వరునికే గాని అన్యులకు సాధ్యం కానిది.

తాము సాధనకాలంలో జరిపిన పర్యటనలలోని ఎన్నో విశేషాలను స్వామి ఆ యా సందర్భాలలో వెల్లడించారు. ఒకసారి ఎడారిలో, మండుటెండలో స్వామి ప్రయాణిస్తూ తీవ్రదాహంతో ఉండగా, అగంతకుడెవరో వచ్చి మంచితీర్థమునిచ్చి సేద తీర్చాడు.

-సశేషం

# హైదరాబాద్ సత్సంగ సమావేశములు -నివేదిక

(గతసంచిక తరువాయి) - శివ ప్రసాద్

తరువాత శ్రీ మాతాజీ మాట్లాడుతూ - మనలో మనోనిగ్రహం పట్టుదల లేదు. భగదనుగ్రహం ఉంటే అన్నీ అవే జరుగుతాయి. ప్రహ్లాద కుమారుడు పుడుతూనే ఓం నమో నారాయణాయ అంటూ తల్లి గర్భంలో నుండి బయటకు వచ్చాడు. అసలు ప్రహ్లాదుడు అంటేనే ఆనందం కలిగించేవాడు. అది వస్తూ పోతూ ఉండే ఆనందం కాదు. ఎప్పుడూ ఉండిపోయే ఆనందం. మనను అనుగ్రహించటానికి అతిథిగా వస్తున్న నారాయణుడికి మనం ఎటువంటి స్థానం ఇస్తున్నాము? అనిపిస్తుంది. నారాయణుడి సంగతే అలా ఉంటే, ఇక అవ్యక్తుడైన భగవంతుడికి ఏం స్థానం ఇస్తాము? ప్రహ్లాదుడు అంతటా ఆ నారాయణుడినే దర్శించిన పరమ భక్తుడు. అంతటా వ్యాపించి ఉన్నది ఒకే శక్తి. అది మనలో ప్రాణరూపంలో ఉన్నది. గురుదేవులు అనంత శక్తి స్వరూపులు. అటువంటి శక్తి ఉంటే ఏదైనా చెయ్యవచ్చు. ప్రాణం కూడ పొయ్యవచ్చు. సర్వోపగతుడైన చక్రి మనలో కూడ అంతర్యామిగా ఉన్నాడు. మరి లోపల ఉన్న చక్రి కనిపించాలి అంటే వెతికిచూడాలి. ఆంజనేయస్వామి రాముడికంటె భిన్నంగా ఉన్నాడా? మనం కూడ అటువంటి ఏకలవ్య భక్తులం కాలేక పోవటానికి కారణం మనలో దేహదృష్టి బలిసిపోయి, మనం ధ్యానం చేయటం లేదు. మనందరం మెలకువగా ఉన్నాము అనుకుంటున్నాము. కాని జాగ్రదవస్థ అనే దీర్ఘ స్వప్నావస్థలో ఉండి నిజజాగ్రత్తను గుర్తించలేక పోతున్నాము. కష్టాలు వస్తే భగవంతుడి అర్చామూర్తి ముందు చెప్పుకో. దేవుణ్ణి నమ్మి చెడ్డవారు లేరు. కాని కృత్రిమ విశ్వాసంతో మహాత్ములను, భగవంతుణ్ణి పరీక్ష చేయవద్దు. చేతులు కాల్చుకోవద్దు. భక్తులు నడిచిన మార్గంలో నడిస్తే చాలు మనం తరిస్తాము. తననుతాను తెలిసికొనే ప్రయత్నమే సత్సంగానికి మూలం. జీవితంలో నిజమైన సుఖ సంతోషాలను శాంతిని ఇచ్చేవి, సంపదలు, హోదా, కీర్తిప్రతిష్ఠలు, చక్కని భార్య వంటివి ఏవీ కావు. వీటినన్నిటినీ భగవంతుడికి అర్పిస్తే శాంతిసుఖాలు వస్తాయి. ఆత్మ వస్తువు పూలకు, పళ్ళకు లొంగేది కాదు. మనస్సును నిష్కల్మషంగా చేసి భగవంతుడికి అర్పిస్తే అప్పుడు నీవు నిజంగా ఎవరివో తెలిసికొనే శక్తి వస్తుంది. చావటం మన అంతిమ లక్ష్యం కాదు. బ్రతికి ఉండగానే దేహ భావనను విడిచి పెట్టాలి. దేహం మీది మోహాన్ని వదలించే ఆమోహనాకారుడి మీద ధ్యాసను ఏకాగ్రం చేసి దానిని ధ్యానంగా మార్చి మన జీవిత లక్ష్యాన్ని సాధించాలి అని చెప్పారు.

**10-8-2009**

సంకీర్తన అనంతరం 6గం॥ శ్రీ రామతారక పరబ్రహ్మ ప్రసాద్ మాట్లాడారు. బుద్ధి శుద్ధం కావాలి. మనం పూజ చేసే హనుమంతుణ్ణి బుద్ధిమతాం వరిష్ఠం అన్నారు. పని చేయటానికి బుద్ధి కావాలి, శక్తి కావాలి. ఈ రెంటినీ ఇచ్చే శక్తి హనుమంతుడికి ఉంది. బుద్ధి శక్తి అన్నిటి కంటె గొప్పది. దానికి శాశ్వతమైన ఆనందాన్ని కలిగించేది రాముడు. ఏది కావాలో దానిని మళ్ళీ మళ్ళీ చెయ్యటం వైరాగ్యం. చెరుపు చేసే దానిని విడిచి పెట్టటానికి చేసేది అభ్యాసం. ఈ విషయాన్ని బోధ చేసి, ఆచరింప చేసి, అందరిలో వ్యాపించి ఉన్న చైతన్యాన్ని మన చేత అనుభవంగా పొందించేవాడే గురుదేవుడు. మనం శుద్ధమైన బుద్ధిని ఆయనకు అర్పిస్తే, ఆ శ్రేష్ఠమైన ఆనందాన్ని గురుదేవుడు మనకు ప్రసాదిస్తాడు. రోజుకు కనీసం ఒక గంటసేపైనా వారికి సమర్పించాలి, ఎంత సాధన చేస్తే అంత ఫలం అని చెప్పారు.

తరువాత శ్రీ మాతాజీ తమ అనుగ్రహ భాషణంలో మానవుడు ప్రాపంచికమైన విషయాలను ఎన్నిటిని వరాలుగా పొందినా అవి నిలిచేవి కావు, శాశ్వతంగా ఉండవు. కొన్ని కోరికలు తీరినా, చివరకు బాధే మిగులుతుంది. మానవుడికి శాశ్వతమైన ఆనందాన్ని సుఖశాంతులను ప్రసాదించేది, ఆత్మ సాక్షాత్కారానుభూతి ఒక్కటే. జపాలు, భజనలు, సంకీర్తనలు, యజ్ఞయాగాలు, పూజలు ఎన్ని చేసినా, శాస్త్రాలను ఎన్నింటిని అవలోకనం చేసినా, ఎన్ని భాష్య శాంతులు చేసినా, బ్రహ్మజ్ఞానం కలుగదు. మందుతో పాటు పథ్యం కూడ చేస్తే గాని రోగం తగ్గనట్లు, నామ జపంతో పాటు మన ప్రవర్తనలో, ఆచరణలో మార్పుతెచ్చుకోవాలి. నిష్కాపట్యం, సచ్ఛీలత, నిష్కామ కర్మాచరణం అలవరచుకోవాలి. శాస్త్రపాండిత్యంతో పాటు అన్ని ధర్మాలను వదలిపెట్టి గీతాచార్యుని వంటి సద్గురువును ఆశ్రయించి, సాధనలో మనకు అడ్డం వస్తున్న వాటిని, చివరకు ఆ గురుదేవుని విషయమై సందేహాలు కలిగినా సరే, ఆ గురుదేవుడికి నివేదిస్తే, కరుణామయుడైన ఆ ప్రభువు అవరోధాలను దాటే ఉపాయం చెప్పి నీకు బ్రహ్మానుభూతిని కలిగిస్తాడు. చిన్న పిల్లలు దుర్వ్యసనాల పాలుకాకుండా ఆదర్శమైన పౌరులుగా తయారు కావాలంటే ముందు పెద్దవాళ్ళు సత్ప్రవర్తన కలిగి ప్రత్యక్ష పరమేశ్వరులైన తల్లిదండ్రులకు సేవ చేస్తూ పిల్లలకు ఆదర్శంగా కావాలి అని చెప్పారు.

**11-8-2009**

సంకీర్తన అనంతరం మొదట శివప్రసాద్ మాట్లాడుతూ, భగవదను భూతికి అద్వైతము, విశిష్టాద్వైతము, ద్వైతము వంటి మార్గాలలో, జ్ఞానమార్గం కన్నా, అందరికీ అనుకూలంగా ఉండేది భక్తి మార్గం అనీ, నవ విధ భక్తులు ఉన్నా అందులో భగవంతుడి దివ్య రసంలో ఏకరసం కావటానికి వాత్సల్య భక్తి, మధురభక్తి లేదా ఆత్మ నివేదన భక్తి అత్యంత అనుకూలమైన వని సోదాహరణంగా చెప్పారు.

తరువాత శ్రీ మనోజ్ ప్రసాద్ - భక్తులు ఏ మార్గంలో నడిచారో, ఉపాసన చేశారో దానికి ఆంజనేయస్వామి చక్కని ఉదాహరణ. ఎందుకంటే ఆయన నోట రామ నామం తప్ప అన్యమైనది రాదు. రాముణ్ణి పొందటానికి మార్గం ఆయన మార్గాన్ని అనుసరించటమే. ఇతర భక్తులతో చేయికలిపి, సత్సంగం సంకీర్తన చేసుకోవటం కన్న కలికాలంలో తరించటానికి మరో మార్గం లేదు. అనుక్షణము రాముని ధ్యాస తప్ప వేరే ఏ ధ్యాస ఉండకూడదు. ప్రభూ! నీవు నా హృదయంలో నివసిస్తున్నావు, నా కది తెలియదు, నీవు నాకు సాక్షాత్కరించాలి. నా మనస్సులో ప్రతి ఆలోచనకు ప్రేరణ నీవే. అందరిలో నీవున్నావు. నా అందరి బంధువులు నీవే అయి, నీవు సర్వాంతర్యామివై అందరి రూపాలను అంగీకరించిన తర్వాత నా అన్ని బాధలు పోతై. మనం ఏది కోరితే అది ఇవ్వటానికి భగవంతుడు సిద్ధంగా ఉన్నాడు. కాని మనకే అడగటం కూడ రావటం లేదు. మనం భక్తి ఉపాయం అనుకుంటాము. కాని అది ఉపాయం కాదు. కేవలం ఆత్మ సమర్పణతో చేసేది. అంతే కాని రెండు పూలు పెట్టి, కొబ్బరికాయ కొట్టి భగవంతుడు కావాలంటే ఎలా? భగవంతుడు జంతర్ మంతర్‌కు, లట్‌పట్‌కి దొరికేవాడు కాదు. కబీర్ అడిగినట్లు ఆంజనేయుడు అరటి తోటలో ఉంటాడా? వివేకానందుడు అన్నట్లు భగవంతుడు మీరు పెట్టే వడలు తింటాడా? ఆయన వీటికి దొరుకుతాడు అని చెప్పటం మభ్య పెట్టటమే. ఎవరి హృదయం నిష్కళంకమై ఉంటుందో, వారికి మాత్రమే ఆయన తేలికగా లభిస్తాడు - అని చెప్పారు.

అనంతరం శ్రీ మాతాజీ తమ అనుగ్రహ భాషణంలో భగవంతుడు అందరి కంటె పెద్దవాడు. ఆయనకిక్కడ నమస్కారం పెడితే చాలదా అని కొందరు అనుకుంటారు. కాని భగవంతుణ్ణి గుర్తించాలి అంటే భక్తుడు ఉండాల్సిందే. ఇంట్లో ధర్మాన్ని చక్కబెట్టకుండా గుళ్ళోనే కూర్చో కూడదు.

ఇల్లు చక్క పెట్టుకోవాలి, దేవుణ్ణి ఆరాధించాలి. ఇంట్లోనే దేవుణ్ణి చూసుకోవచ్చు కదా, ఆలయం ఎందుకు అంటే, ఇంట్లో ఇంత అందంగా అలంకరించలేము, ఇంట్లో ఇటువంటి వేదపఠనం, అన్నీ శాస్త్రోక్తంగా జరగటం ఉండదు. ఇన్ని భక్తి హృదయాలు కలిస్తే కలిగే శాంతి దేవాలయంలోనే సాధ్యం. ఇంట్లో సాధ్యం కాదు. భగవంతుణ్ణి ఇంట్లో పెట్టుకోగానే సరిపోదు. ఎంతో శుభ్రంగా అందంగా ఉంచుకోవాలి. ఎండిన పూలు పెట్టకూడదు. మన హృదయాలు పవిత్రంగా నిర్మలంగా ఉండాలి. జన్మజన్మల నుండి వస్తున్న వాసనలను క్షాళన చేసుకోవాలి. ఇంట్లో  దేవుడి గది ఎక్కడో ఒక మూల ఉంటుంది. అక్కడ అందరూ లౌక్యం ప్రదర్శిస్తారు. శ్రద్ధగా చెయ్యరు. అందరిలో ఉన్నది ఒకటే తత్వం. మనందరం మనస్సులో ఆదరపూర్వకంగా మనలో ఉన్న శక్తితో రమించాలి. పాదరసం గట్టి పడాలంటే దానికి తులసి రసం అందించినట్లు, చంచలమైన మనస్సుకు ఆ సీతారాముల దివ్య చరణాలను అందిస్తే అది ఏకాగ్రత చెందుతుంది. భగవన్నామము వలన కలిగే ఆనందం సహజమైన ఆనందం. దేహాభిమానం, దేహవాసన వదలితేగాని దానిని పొందలేము. ఎవడైతే రాముడి చేతిని వదలి సంసారంలో పడతాడో, వాడు భవసాగరంలో మునిగి పోతాడు. కాని భగవంతుడే, మన దేవుడే మన చేతిని పట్టుకుని ఉంటే మనం భయపడవలసిన అవసరం లేదు. ఈ కనిపించే జగత్తుకంటే కూడ, జగత్తుకు అధినేత ఆ శ్రీరామచంద్రుని ఆశ్రయిస్తే మనకు ధైర్యం వస్తుంది. ధర్మం ప్రకారం ఎంత వరకో అంతవరకే చేస్తే బంధన ఉండదు. అటువంటి ధైర్యంతో లక్ష్యార్థ సాధనలో మన జీవితాలను పునీతం చేసుకోవాలి. ఒక డివైన్ పవర్ మనందరికీ అందుబాటులో ఉన్నది. దానిని గుర్తించండి. గురువులు వేరుగా కనిపిస్తున్నా గురుత్వం ఒక్కటే. దేవుళ్ళు వేరువేరుగా కనిపిస్తున్నా దైవత్వం ఒక్కటే. ఒక గురువులో లేదా ఒక దేవుడిలో లేనిది ఇంకొక గురువులో లేదా దేవుడిలో ఉందనుకోవటం భ్రమ. మీరు ఆశ్రయించిన గురువును లేదా భగవంతుణ్ణి మార్చుకోనక్కర్లేదు. ఒక్క గురువునే లేదా ఒక్క భగవంతుణ్ణే ఆశ్రయించండి. ఇతర భావాలు దుఃఖాన్ని కలిగిస్తాయి. మనం ఆశ్రయించిన గురుదేవుడు చూపిన మార్గంలో నడిస్తే వారు పొందే ఆనందాన్ని మనమూ పొంద గలుగుతాము. నీవెవరో నీకు తెలిసేలా వారు చేస్తారు, అని చెప్పారు.

ఆనాటి కార్యక్రమాలతో భాగ్యనగర్ సత్సంగాలు ముగిశాయి. *

## ఆగస్టు త్రయాహ్నిక సత్సంగ కార్యక్రమం - నివేదిక

- శివ ప్రసాద్

(గతసంచిక తరువాయి)

**14-8-2009**

రెండవ సభ సాయంత్రం 4గం॥ 30॥నిలకు ప్రారంభమైంది. కుమారి సుషుమ్న ప్రసాద శ్రీకృష్ణుని జన్మదిన శుభాకాంక్షలు తెలుపుతూ'it is a happy occasion for all of us. It is play boy's birthday. రాజకీయ కృష్ణుడి కంటె, పెద్దవాడైన కృష్ణుడి కంటె, బాల కృష్ణుడంటేనే అందరికీ ఇష్టం' అని బాలకృష్ణుని లీలలను వర్ణించారు.

తరువాత 6గం॥లకు శ్రీ మనోజ్ ప్రసాద్ మాట్లాడారు. ఈ సాయంత్రం ఎంతో అందమైనది. సూర్యుడి తీక్షత తగ్గి మలయ పవనములు చల్లగా వీస్తుంటే ఆ సమయంలో భగవత్తత్త్వం వినాలి అన్న కోరిక కలుగుతుంది. అనుభవం ఉన్నవారు ఆ కృష్ణ తత్వం గురించి చెప్పాలి అంటూ తాను గురుదేవుల వద్ద సమర్థ రామదాస జీవిత చరిత్రను చదివి నప్పుడు శ్రీ బాబూజీతో తమకు కలిగిన అనుభవాలను నెమరు వేసుకున్నారు. చివరగా ఒక్క ఐడియా (idea) మన జీవితాన్నంతా మార్చివేస్తుంది అని stand and talk మనం నుంచున్నా, నడుస్తున్నా, ఏం చేస్తున్నా, గురుదేవుల బోధను, గురుదేవులనే స్మరించుకుంటే మన జీవితాలు పూర్తిగా మారిపోతాయి అని చెప్పారు.

అనంతరం శ్రీమతి సుశీల **యస్య సర్వే సమారంభాః కామసంకల్ప వర్జితాః । జ్ఞానాగ్ని దగ్ధ కర్మాణం తమాహుః పణ్డితం బుధాః ॥** అనే భగవద్గీత నాల్గవ అధ్యాయంలోని 19వ శ్లోకం చదివి దాని అర్థాన్ని వివరించారు.

**15-8-2009**

ఉదయం 9గం॥లకు శ్రీరమణ ప్రసాద్ సభాప్రారంభం చేస్తూ అంతా నీవే అనే సమర్పణ భావం వలన మనలో ఒక భగచ్ఛక్తి వస్తుంది, అది ఒకసారి కలిగితే ఇక దానిని మించింది ఏమీ లేదు, మనం భగవంతుని స్వరూపం అయ్యే ఉన్నాము, కాని మనమే తెలుసుకోవటంలేదు, నా పాదములు నీ శిరస్సున దాల్చావు కదా, గరుత్మంతుడి వలన నీకు ఏ అపకారం జరగదు అని శ్రీకృష్ణుడు కాళీయుడికి అభయం ఇస్తాడు, అలాగే గురుపాదములు మనస్సులో దాల్చినవాడికి భయం లేదు అని, భగవంతుణ్ణి తెలుసుకోవాలంటే అతడి గుణగణాలను సంకీర్తన చేయాలి, భగవంతుణ్ణి పొగడినందు వలన

ఆయనకు ఒరిగేది ఏమీ లేదు, నీ మనస్సే క్షాళన అవుతుంది అని శ్రీబాబు చెప్పారు, అన్నారు.

అనంతరం 9గం॥15ని॥లకు శివ ప్రసాద్ కర్కట్యుపాఖ్యానం (యోగవావాసిష్ఠం)లోని కర్కటి ప్రశ్నలు, వాటికి రాజుగారు ఇచ్చిన సమాధాలనాలు వివరించి, ఆ పరమాత్మతత్వం తెలుసుకొనటానికి అందరికీ అందుబాటులో ఉంటే మార్గం భక్తి అని నవవిధ భక్తులున్నా వాత్సల్యభక్తి, మధురభక్తి లేదా ఆత్మనివేదన భక్తిలో రసోత్పాదన, ఆనందం ఎక్కువగా ఉంటాయని, ఆ దివ్య భక్తిప్రేమ రసాస్వాదన కోసమే శంకర భగవత్పాదాచార్యుల వంటి మహాత్ములు కూడా తమ అద్వైతాన్ని వదలి ఒక దివ్య అద్వైతంలో ప్రవేశించి ఆ శ్రీకృష్ణుడి ప్రేమరసాన్ని ఆస్వాదిస్తూ అందులో ఓలలాడటానికి విహ్వాలులౌతారు అని చెప్పారు.

అనంతరం 9గం॥ 45ని॥లకి మనోజ్ ప్రసాద్ మాట్లాడుతూ నిన్న (stand and talk)నడుస్తూ కూడా భగన్నామం చేసుకోవాలి అని చెప్పుకున్నాము. ఈరోజు(sit and talk) సిట్ అండ్ టాక్ అంటే కూర్చుని ఉన్నా ఏం చేస్తున్నా ఆయన స్మరణలో ఉంటే సత్యకాలంలో నివసించినట్లే. ప్రతిరోజు గురుదేవుల నామం చేసుకుంటే ఎంతో ఆనందంగా ఉంటుంది. తల్లిదండ్రులు ఇచ్చే ఆస్తి తరిగిపోతుంది కాని శ్రీ గురుదేవులు ఇచ్చిన ఆస్తి ఖర్చు పెట్టినకొద్దీ పెరుగుతూ పోతుంది. దానిని ఎలా ఖర్చుపెట్టుకోవాలి అనేది కూడా శ్రీగురుదేవులే చెప్తారు. సన్నిధిలో సంభాషణ అంటే - సంభాషణ అంటే నీకు తెలిసింది నలుగురికీ ఆమోదయోగ్యంగా ఉండేలా చెప్పటం. అలా ఆమోదయోగ్యంగా ఉండేవి, ఆనందం కలిగించేవి గురుదేవుల మాటలు. గురుదేవుల తిట్లు కూడా ఆనందం కలిగిస్తాయి. అంతపెద్ద చేప కూడా చిన్న మాంసపు ముద్దకు దొరికినట్లు, అంత పెద్ద భగవంతుడు కూడా చిన్న నామమునకు దొరికిపోతాడు. ఆ నామాన్ని నిరంతరం జపిస్తే అగ్ని ప్రజ్వరిల్లి ఆ మహాగ్ని నీ పాపాలన్నిటినీ దహించివేస్తుంది. శ్రీగురుదేవుల దర్శనం చాలు. నీవు ఏమీ చేయనక్కరలేదు. అన్నీ వాటంతట అవే వస్తాయి. నీవు సంపాదించ నక్కరలేదు. సంపాదించిన పుణ్యాన్ని సద్వినియోగం చేయి. నీ మానవ జన్మను సార్థకం చేసుకో. శ్రీగురుదేవుల చిన్న చిన్న మాటలు కూడా బోధ, మహా ప్రసాదం అని చెప్పారు.

10గం॥ 20ని॥లకు శ్రీమాతాజీ తమ అనుగ్రహభాషణంలో - షటప్ అండ్ డిపార్ట్ (shut up and depart)లాగా అనవసరమైన విషయాలు

మానేయాలి. లేదా అక్కడినుంచి వెళ్ళిపోవాలి. మాట్లాడుకుంటే గురుదేవుణ్ణి గురించే మాట్లాడుకోవాలి. జీవుడిలోనే దోషాలు ఉన్నై. నీ దోషాన్ని నీవు గుర్తించాలి. ఎవరైనా నీరు ఉన్నచోట లేదనుకుని కాలు పెడితే కాలుజారి పడరా? మన దోషాన్ని మనం గుర్తించకుండా ఆ దేవుడికి ఇంకా దయ కలగలేదండీ అంటే ఎలా?'ఏమమ్మా ఎన్నాళ్ళనుండి చూస్తున్నాను నీకోసం? ఎన్నాళ్ళకు వచ్చావు? ఇన్నాళ్ళకా వచ్చేది' అంటే 'మీ దయ కలగాలి బాబూ! ఇన్నాళ్ళకు మీ దయ కలిగింది అందుకని ఇప్పుడు రాగలిగాము' అంటాము. మన తెలివితో ఏదో చాలా తెలివిగా మాట్లాడాము అనుకుంటాము. ఆయన తెలివితక్కువ వాడా! 'మరి అక్కడ ఉండగా నన్ను తలచుకున్నావు కదా? అది ఎవరి దయ? అప్పుడు కొంచెం ప్రయత్నం చేస్తే వచ్చేదానివే కదా!' అంటారు. దేవుడి వల్ల దోషం లేదు. ఆయన కడిగిన ముత్యం వంటివాడు. మనలోని దోషాన్ని గుర్తించమన్నారు కాని అయ్యో నేను దేనికీ పనికిరానివాణ్ణి అనుకోమనలా. నీ గుణదోషం ఇందులో ఉన్నది అని వెతికి మనస్సుకు చూపిస్తూ, ఆ భగవంతుడి తత్వాన్ని మాటిమాటికీ అందిస్తుంటే మనస్సు ఆ తత్వస్వరూపాన్నే పొందుతుంది. పరధ్యాస అనే జగత్తును ఆశ్రయించి తనదైన చీకటిని చూపించే వెలుగును గుర్తించలేక పోతున్నాము. ప్రతీదీ భగవంతుడిది అని గుర్తించాలి. చీకటిని, వెలుగును రెంటినీ గుర్తించేది మనలో ఉన్న వెలుగే ఆ వెలుగు ఎప్పుడూ ఆరదు. అది మనలో పరంజ్యోతిగా ప్రకాశిస్తున్నది. దానిని ఎలా గుర్తించాలి? ఇంద్రియాలు అంతర్ముఖమైతే లోపల ఉన్న పరమాత్మను గుర్తిస్తాయి. అప్పుడు ప్రతిదానిలో ఉన్న నీలమణిని గుర్తిస్తాము. గురుతత్వం సూక్ష్మాతిసూక్ష్మమైనది. మనకంటికి కాంతిని గురుదేవుడే ఇచ్చాడు. అజ్ఞానంలో ఉన్న మనకు జ్ఞానాంజనమనే శలాకతో నీ గురుదేవులే ఆపరేషన్ చేస్తున్నారు. నీ అజ్ఞానం తొలగించి జ్ఞానాన్ని ప్రసాదిస్తున్నారు. భగవన్నామాన్ని చేయాలంటే నీకు అడ్డు వచ్చేవి నీలోని కామక్రోధాదులు, రాగద్వేషాలు మొదలైనవి. నీకు అడ్డు వచ్చేవన్నీ నీలోనే ఉన్నాయి. అవి పోతే నీవు ఉన్నది ఉన్నట్లుగా గుర్తిస్తావు. అక్కడ ఎప్పుడూ ఉన్నది చైతన్యమే. రూపం తీసుకుంటే తేడా చూస్తున్నావు. దివ్యత్వం దగ్గర తేడా లేదు. శక్తి ఒక్కటే. ఇంద్రియాల ద్వారా నీ దృష్టిలో భేదాలు ఏర్పడుతున్నాయి. కాని వీటన్నింటికీ వెనుక ఉన్న శక్తే గురుశక్తి. మనం దానిని ఆశ్రయించి భేదదృష్టి పోగొట్టుకోవాలి - అని చెప్పారు. *

# జ్ఞాన యోగం

- సిలువేరు సుదర్శన్

ఆత్మ స్వరూపం జ్ఞానం. ఆత్మ జ్ఞానమే దుఃఖరాహిత్యమార్గము. భౌతిక శాస్త్రజ్ఞానం మనస్సును నియంత్రించుకొనడానికి సహాయపడదు. ఆత్మజ్ఞానం చేత మనస్సు శుద్ధియై అజ్ఞానం నశిస్తుంది. సత్యాసత్య, నిత్యానిత్య విచక్షణ ద్వారానే ఇది సాధ్యం. దీనికి నిస్స్వార్థ జీవిత విధానం అవసరం. మానవ జీవిత గమ్యం ఆత్మజ్ఞానమే.

అంతర్దృష్టి కలవారికే ఆత్మజ్ఞానం అలవడుతుంది. కర్తృత్వభావన, భోగదృష్టి అవరోధాలు. సత్యనిష్ఠ, సత్త్వగుణ అభివృద్ధి, అద్వైత భావన సహాయకారులు. మనోవాక్కాయ కర్మల నియంత్రణ, పశ్చాత్తప్త హృదయం, శాంత చిత్తం, శరణాగత భావన, సహనశీలం, వినయం కలిగి ఉన్నప్పుడు బుద్ధి శుద్ధమై, ఆత్మ దర్శనానికి బాట సుగమమవుతుంది. తీవ్రమైన అభీప్స, సజ్జన సాంగత్యం సహాయకారులు.

జీవితం సంస్కరింపబడనిదే ఆత్మజ్ఞానం సులభంకాదు. వివేకంతో కూడిన వైరాగ్యభావన ముఖ్యం. "నేను'' అనేదే అహంకారం, "నాది'' అనేది మోహం - ఇవిరెండూ స్వస్వరూపం గ్రహింపనీయవు. భోగలాలస వలెనే కీర్తికాంక్ష కూడ త్యాజ్యం. పుణ్యాపాపభావాల కన్న ధర్మనిష్ఠ సత్యమార్గంలో నడిపిస్తుంది. శ్రవణ, మనన, నిదిధ్యాసనలు ఆత్మజ్ఞానానికి సోపానములు. పరోపకారార్థం వినియోగింపబడినప్పుడు సంపద ప్రతిబంధకంకాదు.

నిత్యానిత్య వివేక విచారణతో సాధన ప్రారంభించి మనస్సులో భగవద్భావన ఎప్పుడూ వదలరాదు. భోగాలమీద ఆసక్తి వదలడం, స్వార్థదృష్టి వీడడం వైరాగ్యం అలవరచుకొనేమార్గం. 'నేను', 'నాది' అనే అహంకార మమకారాలే అజ్ఞానం. అది తొలగితేకాని జ్ఞానసాధన ఫలించదు. ఈ బంధాలు వదలిపోవడమే మోక్షం.

సాధనలో అలవడిన భావాలు ఆలోచనలను, ప్రవర్తనను ప్రభావితం చేస్తాయి. జీవిత వ్యాపారాలలో ప్రతిబింబిస్తాయి. మానవ సంబంధాలలో జన్మ కన్న గుణం, మతం కన్న మానవత్వం, దేహం కన్న ఆత్మ ముఖ్యమని, అందరు మానవులు ఆత్మ స్వరూపులేఅని మరచిపోరాదు. ప్రారబ్ధకర్మల అనుభవానికి, వాసనా క్షయానికి ఈ జన్మకలిగినది అన్న స్పృహతో పవిత్రంగా జీవిస్తూ నూతన వాసనలను దరిజేరనీయరాదు. ద్వేషం, క్రోధం, కోరికలు,

నామరూపాత్మకమైన ఈ ప్రపంచంపై మమకారం నూతనవాసనలను పోగుచేస్తాయి. మౌనసాధన, ఏకాంతవాసం, ధ్యానసాధన చాలా ఉపయోగం. ఈ పురుష ప్రయత్నానికి ఈశ్వరానుగ్రహం తప్పక లభిస్తుంది.

ఈశ్వరానుగ్రహమనగా ఈశ్వర శక్తిని అందుకొనడం. పరిమితమైన మానవశక్తిని అనంతమైన ఈశ్వర శక్తితో జోడించడం. ఇది సర్వులకు లభ్యమయ్యేదే. మనలోని దుష్టగుణాలే దీనికి అవరోధాలు. వాటిని తొలగించుకొనడం, కళ్యాణ గుణాలు అలవరచుకొనడం ఈశ్వరశక్తిని అందుకొనే మార్గం. మృత్యుభయం పోగొట్టుకొనడానికి, సంసార బంధం తెంచుకొనడానికి, ఈ జన్మలోనే ఆత్మదర్శనం అనుభవించడానికి, స్వస్వరూప జ్ఞానం పొందడానికి ఇదే విధానమని మన మహాఋషుల ఉద్బోధ. *

ఆధ్యాత్మిక జీవితసార సంగ్రహం - భగవంతునివైపు మానవుని ఆరోహణ, మానవునివైపు భగవంతుని అవరోహణ.

- బ్రహ్మర్షి వేంకటరత్నం

ఒక భక్తుడు ఉండెను. అతడు గ్రామమునందు భక్తవరుని వలె పూజింపబడుచుండెను. ఒకరోజున ఒక నూతివద్దనుండి ఆ భక్తవరుడు వెళ్ళుచుండెను. అచ్చటికి ఒకామె నీరు తోడుకొనుటకు వచ్చెను. ఆమె భర్త ఆ భక్తవరుని సత్సంగమునజేరి సకల గృహ సౌఖ్యములను వర్జించెను. సాధువులను సేవించుచు సత్సంగము చేయుచు కాలక్షేపము చేయుచుండెను. కావున ఆమెకు ఆ భక్తవరునందు ద్వేషభావము పెరిగియుండెను. ఆమెకు ఆ భక్తవరుని చూచినతోడనే అపరిమితమగు కోపము వచ్చెను."ఓరి, భక్తుడా! నీవు భక్తుడవు కాదు, పచ్చిదొంగవు. ప్రజలను నీవు మోసము చేసి భక్తులనుగా మార్చుచున్నావు.''ఆ మహాభక్తుడు వినయముతో చేతులు జోడించి చెప్పసాగెను. "అమ్మా, తమరే నన్ను బాగుగా గుర్తించిరి. ప్రపంచములో నితరులు ఎవ్వరు గుర్తించలేదు. నేను దొంగను కానిచో ఈ జన్మ చక్రములో ఎందుకు తిరుగుదును?'' ఇది విని ఆమె తనలో తాను సిగ్గుపడెను.

-వార్తాలాపము, నాల్గవ ప్రసంగమునుండి




(గతసంచిక తరువాయి) -రమణ ప్రసాద్

"వసుదేవుడికి దక్కిన సౌభాగ్యం నాకు ఎలా వస్తుందా? అన్న ఆలోచనే నాలో మెదులుతున్నది'' అన్నాడు అక్రూరుడు వికల మనస్కుడై. యాదవ కులం యొక్క స్వర్ణయుగంలో.... అంధక మరియు వృష్ణి వంశజులు వసుదేవ ఉగ్రసేనులు పరిపాలిస్తుండగా నేను వారితో గడిపిన రోజులు.... ఓహ్! ఏమని చెప్పను? కాని నాలోని దౌర్బల్యం వలన నేను తెలిసీ తెలియక చేసిన పాప కార్యాలను తలుచుకుంటుంటే....''

"అయితే ఏమైంది? బలహీనత, పాపము... ఈ రెండూ మానవ దేహానికి చర్మం అంటుకుని ఉన్నట్లు అంటుకునే ఉంటాయి కదా....'' అన్నాడు ఉద్ధవుడు.

"కాదు ఉద్ధవా కాదు! వసుదేవుని అస్తిత్వం ముందు వృష్ణి, అంధక వంశజుల సద్భావాలను, సంతరించు కున్నది..... తరువాత ఆ సద్భాగ్యం కృష్ణమయమైంది.... అందువల్ల నేను ఆ పని చేయలేకపోయాను. అందువలననే నేను ఇలా అవస్థ పడుతూ వ్యధచెందుతున్నాను.... యోగసమాధి పొందే దక్షతను నేను పొందలేక పోయాను. ఇటు చూడు.... వసుదేవుడికి కృష్ణుడు పుట్టాడు..... ఆ కృష్ణుణ్ణి నేను కంసుని వద్దకు చేర్చి కంసుని మృత్యువుకు కారణభూతుడనైనాను. అదీ ఎప్పుడంటే... అది గుర్తుకు వస్తుంటే... ఇన్ని సంవత్సరాల తరువాత కూడా నామీద నాకే అసహ్యం పుడుతోంది ఉద్ధవా!'' అక్రూరుని కంఠం రుద్ధమైంది.

ఉద్ధవుడు ఏమి మాట్లాడలేదు. అతడి కనులముందు కూడా గోకులం ప్రత్యక్షమైంది. అక్రూరుడు ధనుర్యజ్ఞానికి ఆహ్వానం తెలుపుతూ కృష్ణబలరాములను తనతో మధురానగరానికి తీసుకువెళ్ళటానికి వచ్చిన రోజు.... ఆ రోజు ఉద్ధవుడు అక్కడే ఉన్నాడు. కంసుడు ధనుర్యజ్ఞానికి పంపిన ఆహ్వానం ఒక మిష మాత్రమే. కృష్ణ బలరాములను మట్టు పెట్టటానికి కంసుడు చేసిన ప్రయత్నాలు వ్రజ భూమిలో తెలియంది ఎవరికి? వృష్ణి, అంధక

గణతంత్ర రాజ్యాలను నిర్వీర్యంగా చేసి కంసుడు వ్రజ భూమిని ఏకఛత్రాధిపత్యంగా ఏలాడు - అంతే కాదు - గణతంత్ర పరిషత్తులో అగ్రగణ్యుడైన తన తండ్రినే అందరి సమక్షంలో కంసుడు కారాగారంలో బంధించాడు! ఎవ్వరూ ఏమీ చేయలేకపోయారు. అందరూ చూస్తూ ఊరక ఉండిపోయారు.

అంతా తెలిసి కూడా కంసుని నియంత్రణను తీసుకుని స్వయంగా అక్రూరుడే వచ్చాడు! ఉగ్రసేనుడు వసుదేవుని వంటి గణమాన్యులు అయిన వారిని కారాగారంలో బంధించిన తరువాత వారి సమకాలికుడైన వాడు అక్రూరుడొక్కడే మిగిలాడు. యాదవ గణతంత్రంలోని వారు అక్రూరుని మాటలను ఆదేశపూర్వకంగా స్వీకరిస్తారు. కంసుడికి అందరూ భయపడతారు. అక్రూరుని ఆదరిస్తారు. వారు ఆదరం చూపటానికి ఒకే ఒక్క కారణం - వసుదేవ ఉగ్రసేనులకు గణతంత్రానికి అక్రూరుడు అందించిన సేవల ప్రతిఫలమే....

కంసుడు చాలా చతురుడు. అతడు మనషులను ఎప్పుడు ఎలా వాడుకోవాలో బాగా తెలిసినవాడు.... మరి అక్రూరుడు కూడా మానవసహజమైన బలహీనతలు లేనివాడు కాడుకదా! రాజమాన్యత పొందుతూ ఉండాలనే లాలస అతనిలో బాగా వేళ్ళు పాతుకుని ఉన్నది. అతడు అధికార దర్పాన్ని రుచిచూచిన వాడు. అది పాముపిషంలాగా ఒకసారి పైకెక్కితే అది పైకే పోతుంది.... దానిని ముంగిసలాగ లాగి పారవేసే వసుదేవుడు ఉగ్రసేనుని వంటివారు బహు కొద్దిమంది మాత్రమే ఉంటారు. అక్రూరుడు అలాంటివాడు కాదు....

జరిగిన విషయాల తాలుకు వ్రణములను - వాటిని తిరగతోడటం వలన ఒరిగేదేమిటి. అక్రూరుడు వాటిని గుర్తు చేసుకోకపోవటమే మేలు - అని తలచిన ఉద్ధవుడు “తండ్రీ! జరిగిన సంఘటనలకు మనం కేవలం నిమిత్త మాత్రులమని దాని వలన వచ్చిన కీర్తి అపకీర్తులు అన్నీ మాహోకాలుని చరణాలకు సమర్పించి, వాటినుండి ముక్తిపొందటమే జ్ఞానం! స్మరణ సుఖాన్ని ఎలా ఇస్తుందో, అలాగే విస్మరణ కూడా సుఖశాంతులను ప్రసాదిస్తుంది” అన్నాడు.

“స్మృతి విస్మృతుల హద్దులు అగోచరం ఉద్ధవా! ఎప్పుడో ఎక్కడ నుంచో ఏదో ఒక ప్రేతం పిలుస్తుంది!... అప్పుడు మనం భయవిభ్రాతులం అవుతాము.... నేను ఆ నీటిలో కుత్తుకబంటి దాకా మునిగి ఉన్నాను ఉద్ధవా!.... ఆ ప్రేతాన్ని ఆహ్వానించి దానికి అర్ఘ్యం వదలకుండా జీవించి ఉండలేను” అన్నాడు అక్రూరుడు. ఒక్కొక్క మాటను నొక్కి నొక్కి పలుకుతూ.

"ఏ క్షణంలో కంసుడు నన్ను పిలిచి ఆదేశాన్ని ఇచ్చాడో ఆ క్షణం..." అక్రూరుడు మాట్లాడలేక పోయాడు.

" ఏమన్నాడు కంసుడు మీతో?"అన్నాడు ఉద్ధవుడు. తనకుకూడా తెలియని ఏదో కొత్త విషయాన్ని అక్రూరుడు తనకు చెప్పబోతున్నట్లుగా ఉన్నది.

"కంసుడు ఏమన్నాడంటే...... ఉద్ధవా! ఏమన్నాడంటే........." అంటూ అక్రూరుడు కన్నులు మూసుకున్నాడు.

మధురానగర వాసులు ఊహించలేనిదే జరిగింది! గణతంత్ర అధిపతి ఉగ్రసేనుణ్ణి యువరాజైన కంసుడు ఖైదీ చేసి సమస్త గణతంత్రపరిషత్తును అవమానించాడు. వ్రజ భూమి ఏదో దుస్స్వప్నం చూస్తూ ఘోర అవమానాన్ని పొందినట్లుగా అయింది....

వృష్ణిగణతంత్రానికి చెందిన ఇద్దరు అగ్రగణ్యులు వసుదేవుడు, అక్రూరుడు. అంధక గణతంత్రానికి అధిపతి ఉగ్రసేనుడు. ఈ రెండు గణతంత్ర రాజ్యాధిపతులు కలిసి వ్రజభూమిని స్వర్గతుల్యంగా చేశారు.

కానీ ఉన్నట్లుండి ఏదో అయింది.... దాని వలన ఈ వ్రజభూమిలోని సుఖశాంతులకు ముప్పువాటిల్లింది... నలుదిశలనుండి సామ్రాజ్యంలో భయ విభ్రాంతులు నెలకొన్నాయి. యువరాజైన కంసుడు అతని నలుగురు అనుయాయులు కన్నుమూసి తెరిచేంతలో రాజ్యాధికారాన్ని హస్తగతం చేసుకున్నారు.... ఉగ్రసేనుణ్ణి బంధించారు. తరువాత వసుదేవుణ్ణి కూడా కారాగారంలో తోశారు.... ఆర్యావర్తనుని గణతంత్రంలో ఇలా ఎన్నడూ జరగలేదు.... చేది, మగధ, పౌండ్ర సామ్రాజ్యాలలో కూడా అలా జరగలేదు. కంసుని ఎదురించి మాట్లాడేవారు మధురానగరంలో ఎవ్వరూ లేకపోయారు. ఎవరన్నా ఎదురుతిరిగితే వారి తలలు నేలమీద పడేవి. బుద్ధజీవుల మనస్సులో మాటిమాటికి ఒక ప్రశ్న తలెత్తేది. ధీరగంభీరుడు, నాయకుడు అయిన ఉగ్రసేనుడి పుత్రుడు ఇలా ఎలా అయ్యాడు అని. తండ్రిని ఇంత అవమానించటమా?..... దానికి కారణమేమై ఉంటుంది?

- సశేషం

Printed, Published by C.V. Ramana Babu, on behalf of YOGINI SRI CHANDRA KALI PRASADA MATHAJI CHARITABLE TRUST and Printed at Samardha Sadguru Publications, D.No. 3-499, Sri Kali Gardens Ashram, Nambur - 522508, Guntur Dist., Andhra Pradesh, and published at D.No. 3-499, Sri Kali Gardens Ashram, Nambur - 522508, Guntur Dist., Andhra Pradesh. Editor - Guda Siva Rama Murthy,